# మానవులు దానవులు

పండంటి జీవితం పగిలిపోయింది. వయసెంతోలేని భర్త అకస్మాత్తుగా మరణించాడు. పసిబిడ్డను అక్కున చేర్చుకుని పగిలే గుండెలను చేతబట్టుకుని, నిస్సహాయంగా మిగిలిపోయిందామె. అందమైన ఇల్లు, కారు, ఫారిన్ టివి, ఫ్రిజ్, మిక్సర్ అన్నీ ఉన్నా, అవి పోయిన మనిషి ప్రాణానికి సాటి రాగలవా? కానీ... వాస్తవంలో ఇరుగు పొరుగు పెద్దలు చేసిందేమిటి? ఆ భార్యాబిడ్డలు పోగొట్టుకున్నదానికన్నా, వారి వద్ద మిగిలి ఉన్నవే ముఖ్యం అనుకునే ఆ మనుషులు ఎలాంటి వాళ్ళు? వాటిలో ఏ వస్తువును ఎవరు స్వంతం చేసుకోవాలనే పరుగు పందెంలో వారు ఎలా ప్రవర్తించారు?

మానవ మనస్తత్వానికి ప్రతీకగా ప్రఖ్యాత హిందీ రచయిత బాలాదూబే రచించిన "సంతాపం" కథను 'విపుల' నవంబర్ సంచికలో చదవండి...

మరే పత్రికా అందజేయని విభిన్న భాషల విశిష్ట కథలకు వేదిక 'విపుల'. కథలతో పాటు రెండు రంగుల చిత్రాలు. నవ్వించే కార్టూన్లు, జోకులు, ప్రపంచ పర్యటన చేయించే విచిత్ర విశ్వ విజ్ఞానం 'విపుల' ప్రత్యేకతలు. ఇవన్నీ కూడా కేవలం రెండు రూపాయలకే మీకు అందుబాటులో ఉన్నాయి.




ప్రతి నెలా 1వ తేదీకి వెలువడే
విశ్వకథా విపంచి

# విపుల

132 పేజీలు
రెండు రూపాయలే

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938—1972]

శుక్రవారం : 7–11–'80
రౌద్రినామ సం. ఆశ్వయుజ బ. అమావాస్య
**సంపుటము 74 : సంచిక 8**

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

పోస్టులో ఏడాది చందా రు. 54-60
ఆరు మాసాల చందా రు. 27-30
విడి ప్రతి వెల ఒక రూపాయి
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ :
''కథాకళి'' కళాకారుడు
దేబ్‌జాని బెనర్జీ

*కథలు :*



*సీరియల్ కథలు :*



*వ్యాసాలు, శీర్షికలు :*

# బ్రూక్ బాండ్
# గ్రీన్ లేబిల్

## మంచి కాఫీకి సారవంతమైన రుచికి ఎల్లప్పుడూ నమ్మవచ్చును






గ్రీన్ లేబిల్ యొక్క రుచి మీరు దీనిని కొన్ని సంవత్సరంలుగా ఇష్టపడేలా చేసింది. సువాసన మరియు సంతృప్తి నిస్తుంది.

## మీ కుటుంబ సాంప్రదాయకంగా వచ్చిన రుచి

OBM.6306A












### ముఖచిత్రం

24.10.80 నాటి 'మహిషాసుర మర్దని' ముఖ చిత్రం ఆకర్షణీయంగా వుండి కనువిందు చేసింది. కార్టూన్లు బాగా నవ్వించాయి. అన్నిటికీ మించి కవిత 'అవినీతి ధ్వజం' చాలా బాగుంది.

జి. శ్రీశైలం (హైదరాబాద్)

### కవిత

మీ (మా) ఆంధ్రపత్రిక (24.10.80) లో ప్రచురించిన మూడు కథలు బాగున్నాయి. "మహిషాసుర మర్దని" ముఖ చిత్రం చక్కగా తీర్చి దిద్దారు. ఈ వారం ప్రచురించిన కార్టూన్స్ మమ్మల్ని కడుపుబ్బ నవ్వించాయి. సీరియల్స్ రెండూ చాలా ఆసక్తి దాయకంగా ముందుకు సాగుతున్నాయి. 28 వ పేజీలో మీరు ప్రచురించిన "విరాట్" గారి "అవినీతి ధ్వజం" కవిత బాగుంది.

రాకుర్తి సత్యనారాయణ, శ్రీనివాస్, మూర్తి, ఆది బ్రహ్మం, (కాకినాడ)

### ఉత్తరాల పేజీ

'మహిషాసుర మర్దని' ముఖ చిత్రంతో వెలువడిన దసరా సంచిక మమ్మల్ని అమితంగా ఆకర్షించినదని తెలుపుటకు సంతోషిస్తున్నాము. ఇందులోని దసరా కార్టూన్స్ ఖిలేగా ఉన్నాయి. కథలు మంచివి ప్రచురిస్తున్నందుకు ధాంక్స్.

ఉత్తరాల పేజీని చివర కాక మొదటి రెండు మూడు పేజీలలో ప్రచురించండి.

ఎస్. అన్వర్ హుస్సేన్ (గిరింపేట)

(64 వ పేజీ చూడండి)



10

(గత సంచిక తరువాయి)

సీ రి య ల్

# ప్రేమతీర్థం

—కళ్యాణీ సోమరాజ్

డాక్టర్ చెప్పిన గడువు దగ్గర కొస్తున్న కొద్దీ దీప మనసు ఖంగారుగా, భయంగా వుంటోంది. 'సీతలాగా తనూ కనలేక చనిపోతేనో!...' అన్న ఆలోచనలతో ఆమెకు రాత్రింబవళ్ళు నిద్ర, మనశ్శాంతి కరువయ్యాయి. ఒకరోజు మనసులో బాధను అణుచుకోలేక చంద్రంతో అనేసింది...

"ఛ, పిచ్చిపిల్లలా భయపడకు. అంతగా కావాలంటే ఆమె చెప్పినట్లు నాలుగు రోజులు ముందుగా ఏం॰ ఖర్మ, వారం రోజుల ముందుగానే జాయిన్ చేస్తాం. ఏ టెన్షన్ పెట్టుకోకు. హఠాత్తుగా వెళ్ళాలన్నా కరణంగారి జీప్ వుంటుంది, అడిగి తీసుకుందాం. అయినా వేనొక టాక్సీ మాట్లాడి వుంచాను" అంటూ చాలాసేపు ధైర్యం చెప్పాక, దీప మనసు శాంతపడింది.

"మరి ఇంట్లో వుండి పనికిమాలిన ఆలోచనలు చేస్తున్నావు. అలా గుడివైపు వెళుతున్నాను. నువ్వు కూడా వస్తావా ?!"

**జరిగిన కథ—7 :** పెళ్లి కాకుండానే తల్లి కాబోతున్న కూతురు దీపను పురుడు అయ్యేవరకు తనదగ్గర వుంచుకోమని న్యూయార్క్‌లో ఉంటున్న చెల్లెలు భానుమతి, అక్కయిన శారదమ్మకు ఉత్తరం వ్రాస్తుంది. ఆమె అనుమతితో శారదమ్మ పొలం వ్యవహారాలను చూస్తున్న చంద్రం ఏర్‌పోర్ట్‌కి వెళ్లి దీపను తీసుకువస్తాడు. దీప వేషధారణను చూసి ఆ పల్లెలోవాళ్లు ఆశ్చర్యంతో వింతజంతువును చూసినట్లు ప్రవర్తిస్తుంటారు. చంద్రం ప్రతీనెలా దీపను తీసుకెళ్లి విజయవాడలోని లేడీడాక్టర్‌కు చూపించి తీసుకు వస్తుంటాడు. తనకు పుట్టబోయేబిడ్డను ఏ అనాథాశ్రమంలోనో జేర్పించి, తన తల్లిదండ్రుల వద్దకు వెళ్లిపోతానని చెప్పిన దీపనుచూసి నివ్వెరపోతాడు చంద్రం. అలా ఆమె వదలివెళ్లిపోయే పక్షంలో, పుట్టబోయే ఆ బిడ్డను తాను పెంచుకుంటాననని చంద్రం శారదమ్మతో చెప్తాడు. దీప బలవంతంమీద, తనకూ సీతకు గల పూర్వ వృత్తాంతాన్ని ఆమెకు చెప్తుంటాడు చంద్రం. చదువు ముగించుకొని ఇంటికి వస్తున్న చంద్రానికి రైల్వేస్టేషన్‌లో సీత పరిచయం అవుతుంది. ఆ తరువాత వాళ్ల పరిచయం దినదినాభివృద్ధి చెందుతుంది. ఓ నాడు చంద్రం తన తల్లిదండ్రులతో సీత అనే పేదపిల్లను ప్రేమిస్తున్నానని, ఆమెనే పెళ్లి చేసుకొంటానని చెప్పగా వారు నిరాకరిస్తారు. ఎవరి తరఫువారూ అంగీకరించకపోవటంతో, యాదగిరి గుట్టమీద తమకు సన్నిహితులైన కొంతమంది స్నేహితుల సమక్షంలో నిరాడంబరంగా పెళ్లి చేసుకుంటారు చంద్రం సీతలు. కొంతకాలం తరువాత, చంద్రం అమ్మమ్మ చనిపోతూ అతని పేర వ్రాసిన ఆస్తిపాస్తులు ఉన్న పల్లెటూరు వెళ్ళి కాపురం సాగిస్తుంటారు. పురుడు పోసుకోవటానికి పల్లెటూరిలో వున్న తన పుట్టింటికి వెళ్తుంది సీత. నెలలు నిండకముందే నెప్పులు రావడం, ఆ పల్లెటూరి నుండి బందర్ తీసుకువెళ్తుండగా మార్గ మధ్యలో ఓ ప్రాణంలేని శిశువుని కని ప్రాణంవిడుస్తుంది. ఈ విషాద కథనం అంతావిన్న దీప, తనకు పుట్టబోయేబిడ్డను చంద్రానికి ఇవ్వటానికి అంగీకరించగా అతను తన కృతజ్ఞతను తెల్పుతాడు.

చంద్రం అడగటమే తడవుగా గబగబా తల పైపైన దువ్వుకొని, శారదమ్మతో వెళుతున్నానని చెప్పి బయలుదేరింది.

గుడి వూరికి చాలా దూరంగా వుండ బట్టి నిర్మలమైన ప్రశాంతత చెక్కు చెదర లేదు. వాళ్ళు వెళ్ళేసరికి సంధ్యా సమయం దాటి, చీకట్లు ఆవరిస్తున్నాయి. గుడిఅంతా పక్షుల కిలకిలా రావాలతో ప్రతిధ్వనిస్తోంది. దేవాలయం ఎప్పుడు నిర్మించారోగాని, ఆ తరువాత ఎవరు దానిమీద పెట్టుబడి పెట్టి నట్లు కన్పించలేదు. దక్షిణ వైపు ప్రాకారం అంతా కూలిపోయి వుంది. ఉత్తరం వైపు చెరువు ప్రవహిస్తూ వుండటం వలన, దేవాలయానికి కొత్త అందం తెచ్చి పెట్టింది. కొంగలు గుంపులు గుంపులుగా వచ్చి చెరువు మీద తమ రెక్కలతో తపతప కొట్టుకుంటూ ఎగిరిపోతున్నాయి. కోవెలలోపల 'వెంకటేశ్వర స్వామి' చిరునవ్వు నవ్వుతూ దర్శనమిస్తున్నాడు. పూజారి వెలిగించిన చిరుదివ్వె గాలికి రెపరెప మంటోంది.

గుడిలోకి వెళుతూనే చంద్రం గంట కొట్టాడు. ఆ ధ్వని నిశ్శబ్దాన్ని చీలుస్తూ గుడి అంతా ప్రతిధ్వనించింది. చంద్రాన్ని చూస్తూనే పూజారి ఆదరంగా నవ్వాడు.

"రాముకి జ్వరం తగ్గిందాండీ !"

"ఈరోజు కొంచెం నెమ్మదించింది. నిన్నైతే మూసినకన్ను తెరవలేదు" అన్నాడు పూజారి విచారంగా.

"డాక్టర్ దగ్గరకు తీసుకెళ్లలేదూ!"

"లేదు బాబు. అంతంత ఫీజు లిచ్చుకొని వాళ్ళకు చూపించినా, ఆ మందులు కొనేందుకు డబ్బు నా దగ్గర లేదు. మెల్లగా తగ్గుతుందిలే అనుకున్నాను." తన బీదరికాన్ని బహిర్గతం చేస్తున్నందుకు సిగ్గు పడ్డాడు పూజారి.

"ఇదిగో, ఈ పాతిక ముందు వుంచండి. ఇంకా కావాలంటే నన్ను అడగండి. మొహమాట పడవద్దు. ఏవో నాటు మందులను నమ్మి పండంటి వాడి జీవితాన్ని పాడుచేయకండి. రేపే విజయవాడ తీసుకెళ్ళండి".

"వద్దు... బాబు... వద్దు! ఇప్పటికే చాలా ఋణపడి వున్నాం. వాడిని చదివిస్తున్నది చాలదా, ఇంకా నిన్ను బాధించనా !"

"శాస్త్రిగారూ! మరేం బాధ పడకండి. రాము బాగా చదివి, పైకి వస్తే, నా ఋణం తీర్చినట్లే భావిస్తాను. డాక్టర్‌కి చూపించడం మాత్రం ఆలశ్యం చేయద్దు." అంటూ మరొకసారి హెచ్చరించి, దీప వెనక తాను బయటకు వచ్చాడు. దీప ఇదంతా ప్రేక్షకురాలిలా చూస్తూ వుండిపోయింది.

"వాళ్ళు చాలా బీదవాళ్ళా!?" దీప అలా అడిగేసరికి ఏదో ఆలోచనలలో వున్న చంద్రం ఉలిక్కిపడి... "ఆఁ...ఆ... ఔను. దానికి తోడు పెద్ద కుటుంబం."

"గవర్నమెంట్ ఏం హెల్ప్ చేయదా!"

చంద్రం నవ్వి "లేదు, దానికితోడు అగ్ర కులాల్లో పుట్టటం మరొక దురదృష్టం. ఎవరు ఎంత కష్టపడి చదివినా రేపు వుద్యోగాలు దొరుకుతాయన్న నమ్మకం లేదు. అన్ని చోట్ల రిజర్వేషన్స్... మిగిలిన కొన్ని జాబ్స్ రికమెండేషన్ వున్నవాళ్ళకు వెళ్ళిపోతాయి. బీదరికానికి పెద్ద కులం, చిన్న కులం అని తేడాఏమిటో? నాకు అర్థంకాదు. వాళ్ళ తాత గార్ల దగ్గరనుంచి ఈ పూజారిత్వాన్ని నమ్ముకొని బతికినవాళ్ళే! ఆ కాలం వేరు, ఈ కాలం వేరు. ఆనాడు పది రూపాయలు సంపాదించుకున్న వ్యక్తి కూడా హాయిగా బతికాడు. ఈనాడు వేలు సంపాదిస్తున్నా నిశ్చింతగా బతకలేకపోతున్నాం. దానికి తోడు శాస్త్రి గారికి పాపం ! చాలామంది సంతానం. పెళ్ళి కెదిగిన కూతుళ్ళు ముగ్గురు వరసగా అలా వుండగా, తరువాత కొడుకులు ఇద్దరూ, చదువు సంధ్యలు లేక పాడైపోతున్నారు..."

"రాముని నువ్వు చదివిస్తున్నావులన్నావు. వాళ్ళ అబ్బాయి కాదా !"

"ఆఁ వాళ్ళ చిన్నవాడు. పెద్దవాడు ఎవరింట్లోనో దొంగతనం చేసి భయపడి పారిపోయాడట. చిన్నవాడినైనా ఒక దారిలో పెట్టాలని చదివించుకొందా మనుకొన్నాడు. సరే, ఏదో ఉడతాభక్తి... నాకు తోచింది నేను చేయ గలిగింది... అదొక్కటే!"

కబుర్లలో చాలా దూరం నడిచారు తెలియకుండా. వూరి మొదట్లో చిన్న టీ స్టాలు వుంది. అది అల్లరి మూకలకు, పోసుకోలుగాళ్ళకు పుట్టిల్లు. చంద్రం, దీప ఆ ప్రాంతాల్లోకి రాగానే, ఏవో నవ్వులు, వెక్కిరింతలు విన్పించాయి. అవి తమ ఇద్దరి గురించే అన్పించింది ఎందుకో! అయినా చంద్రం ఏం పట్టనట్లు ముందుకు నడిచాడు.

"ఏరా! ఎక్కడిదో కొత్త పిట్ట వగిరి రాగానే, మనవాడు పనీ పాట మానేసి దాని వెనక పడ్డాడు."

ఇంతలో ఒకడు—

"సీమనుంచి వచ్చావా..." అంటూ వెకిలిగా పాడాడు.

"వుంచుకొన్న దాన్ని వీధులెంబడి తిప్పు తున్నాడు చూడరోయ్!"

దీపకు కోపం వువ్వెత్తున లేచింది. చంద్రం చట్టుక్కున వెనక్కి తిరగటం, ఆ వాగుతున్న వాడిని చంప ఫడేల్ మనిపించటం త్రుటిలో జరిగిపోయింది. దీప కూడ గమనించ లేదు. అంతే! ఒక్కసారి అక్కడున్న 'గాంగ్' అంతా చంద్రం మీద పడ్డారు. ఈ విషయం ముందే గ్రహించి, మెరుపులా ఆ టీస్టాలు పక్కనే పడివున్న కర్రనొకటి చేతికి తీసు కొన్నాడు చంద్రం. దీప కట్టెలా బిగుసుకు పోయి,జరిగేదంతా సినిమా చూసినట్లు కళ్ళు అప్పగించి చూస్తోంది. చంద్రం భారత యుద్ధంలో సవ్యసాచిలా కర్రను అటు, ఇటు తిప్పుతూ అందర్నీ అదరకొట్టాడు. చంద్రం ధాటికి ఆగలేక ఆ ముఠా పలాయనం చిత్త గించింది. అయితే ఒకటి రెండు దెబ్బలు చంద్రానికి తగలక పోలేదు.

"అబ్బ! ఎంత భయంకరమైన సంఘ టన. ఈ వూళ్ళో ఏం జరిగినా వీళ్ళకే కావాలా!" రోషంగా అంది దీప.

"ఈ గుంపు కరణంగారి తాలూకు మనుష్యుల్లే. చాలా రోజుల నుంచి చూస్తు న్నాను, ఏదో పిచ్చివాగుడు వాగుతూ నన్ను చికాకు పెడుతున్నారు."

"ఎందుకు, ఆయనకు నీమీద అంత కోపం?"

"ఏముంది, వాళ్ళమ్మాయిని నేను చేసుకో నన్నానని!"

"పోనీ చేసుకోకూడదూ! ఈ దెబ్బలు తినకపోతే!"

"ఎవరూ, ఆ రాణీనా! అంతకంటే ఈ దెబ్బలు నయం."

ఇద్దరూ జరిగింది మర్చిపోయి హాయిగా నవ్వుకున్నారు.

* * *

ఆరోజు పొద్దున్నుంచీ ఎడతెరిపి లేకుండా వాన కురుస్తోంది. శారదమ్మ వర్జ్యం, వారం, తిథి, నక్షత్రం అన్నీ విచారించి దీపను హాస్పటల్లో చేర్చటానికి మరునాడే మంచిదని నిశ్చయించింది, అప్పటికీ డాక్టర్ రమ్మన్న రోజుకి ఇంకా మూడురోజులు ముందుగానే! చంద్రం మాట్లాడిన టాక్సి మరునాడు పొద్దున్నే వస్తుందని చెప్పటంతో, శారదమ్మ హడావిడిగా, అక్కడికి తీసుకెళ్ళే సామానంతా సర్దుతోంది. దీప మనస్సెందుకో చికాకు, అశాంతిగా వుంది. కాలుగాలిన పిల్లిలా ఇల్లంతా తిరుగుతోంది. "ఎప్పుడెప్పుడు ఈ గొడవ అయిపోయి తను మామూలు దీపలా మారిపోతానా!" అని ఆదుర్దాగా వుంది. దీప రాత్రి సరిగ్గా భోజనం చేయలేదు. శారదమ్మ ఎవర్నీ కనీ పెంచిన మనిషి కాదు. అందుకని దీపలో జరుగుతున్న గొడవేమిటో ఆమెకు అర్థం కాలేదు. పొద్దున్నే మొదలైన వాన, కడుపులో నొప్పి తెరల్లా తగ్గుతోంది, కురుస్తోంది. రాత్రి కాగానే ఉరుములు మెరుపులతో కుండపోతగా కురవసాగింది. పడుకున్నదన్న మాటేగాని దీప కంటిమీద కునుకు రాలేదు. ఎప్పుడో మాగన్నుగా పట్టిన

## ధర్మపథం — బులుసు వేంకట రమణయ్య

# ఉత్తమ కర్మ - యథార్థ మిత్రుడు

మనం చేసే ఉత్తమ కర్మను యథార్థ మిత్రునితో పోల్చవచ్చును. దీనిని వివరిం చుటకు ముందు యథార్థ మిత్రుడు ఎలాంటి వాడో తెలుసుకోవలసి ఉన్నది.

మనతో కలిసి మెలిసి వుండి స్నేహం పాటించేవారందరూ యథార్థమైన మిత్రులే అని తలచరాదు. వారిలో ను వ్యత్యాసం కానవస్తూ ఉంటుంది.

ఒకనికి ముగ్గురు మిత్రులున్నారు. అందరూ కలిసి మెలిసి ఎంతో స్నేహంతోనే ఉండేవారు. దురదృష్టవశాత్తు అతడు ఒక కుట్ర కేసులో చిక్కుకున్నాడు. జామీను మీద విడుదల పొందిన అతడు మర్నాడు కోర్టుకు వెళ్ళవలసి ఉన్నది. అతడు ఒక మిత్రుడి వద్దకు వెళ్ళి కోర్టుకు వచ్చి, తన పక్షాన సాక్ష్యం ఇవ్వవలసినదని అడిగాడు. "నీవు నిరపరాధివని నిర్ణయిస్తే బాధలేదు. కాని, అపరాధివే అని నిర్ణయించి శిక్ష విధిస్తే, తప్పుడు సాక్ష్యం చెప్పినానని నన్ను కూడా కోర్టువారు చిక్కులు పెట్టవచ్చు. ఇట్టి వాటిలో అనవసరంగా ఇరుకుకొని నేనూ బాధ పడటం ఎందుకు? ఇలాటివంటే నాకు భయం. నేను ఇల్లు కదిలి రాలేను" అన్నాడు.

మరొక మిత్రుణ్ణి అడిగితే "పూర్తిగా కాదు కాని, కొంత వరకూ సాయపడగలను. నీవు భయపడుతున్నట్లున్నావు. నీకు ధైర్యం కలగడానికి నీతోకూడా కోర్టు దాకా వస్తాను. ఇంత మాత్రమే నేను సహాయపడగలను" అని అన్నాడు. తర్వాత మూడవ మిత్రుడిని అడిగితే "తప్పకుండావచ్చి సాక్ష్యం యిస్తాను, నీతోపాటు కష్టం అనుభవించవలసి వుంటే దానికి నేను సిద్ధమే! ఇట్టి స్థితిలో సాయ పడకపోతే మిత్రుడు ఉండి ప్రయోజనం ఏమిటి?" అన్నాడు. అప్పుడు తెలిసింది అతనికి నిజమైన మిత్రుడు ఎటువంటివాడో అని.

మనం చేసిన మంచి కర్మ ఆ ఉత్తమ మిత్రుని వంటిది. సిరి సంపదలు, ధన ధాన్యాలు అధమ మిత్రుని వంటివి. ఆప్తులు, బంధువులు మధ్యతరగతి మిత్రులవంటివారు. మానవుని ఆత్మ భౌతిక దేహాన్ని విడిచిన తర్వాత,ఆ కళేబరాన్ని రుద్రభూమికి తీసుకుని పోయేటప్పుడు కొందరు ఆప్తులూ, బంధు వులూ దానివెంట వస్తారు. కాని, సిరి సంపదలు, వస్తు వాహనాలూ రావు. అవి యింటి దగ్గరే ఉండిపోతాయి. ఆప్త బంధు వులు శ్మశానం వరకే వస్తారు. తర్వాత వెనక్కి తిరిగి పోతారు. అయితే— ఆ మర ణించిన వ్యక్తిని విడవకుండా, లోకాంతరానికి కూడా వచ్చేది అతడు చేసిన కర్మ మాత్రమే. అతడు మంచిపని చేస్తే లోకాంతరంలో అతనికి ఏలాటి శ్రమా ఉండదు. చెడ్డపనులు చేసి వుంటే యాతనలు అనుభవించవలసి ఉంటుంది. మనం మంచి స్నేహితుణ్ణి సంపా దించడానికే ప్రయత్నిస్తాము గదా! ఆ విధం గానే సత్కర్మలనే ఆచరించడానికి అన్నివిధాలా ప్రయత్నం చెయ్యవలసి వుంటుంది. మానవ శ్రేయస్సుకు సత్కర్మాచరణమే మూలం.

## ప్రేమ తీర్థం

మీద నుంచి కెవ్వున కేకవేస్తూ లేచింది. శారదమ్మకూడా మెలుకవ వచ్చింది.

"ఎందుకేతల్లీ ! పీడకల వచ్చిందా !"

"లేదు పెద్దమ్మా, కడుపులో నరాలన్నీ లాగేస్తున్నాయి. నాకు భయంగా వుంది."

శారదమ్మకు విషయం అర్థమైంది. "మన పిచ్చిగాని మనం పెట్టిన ముహూర్తాలు ఏమూలకి. భగవంతుడు నిర్ణయించి, పెట్టిన సమయం రావాలి" అనుకొంది. వెంటనే పాలేర్ని లేపి చంద్రానికి కబురుచేసింది. శారదమ్మకు ఏం చేయాలో తోచలేదు. అప్పడికప్పుడు పొయ్యి రాజేసి కాసిని నీళ్ళు కాచి పేరినెయ్యి వేసి దీప వద్దన్నా వినకుండా బలవంతంగా తాగించింది, వేడి చేసి అయితే పద్దుకుంటుందేమో అని. పది నిముషాలు పడుకొని మళ్ళీ బాధతో అరిచింది దీప. ఇక లాభంలేదు. హాస్పెటల్‌కి తీసుకెళ్ళాల్సిందే! అని నిర్ణయానికి వచ్చింది. పాలేరు ద్వారా ఈ విషయం తెలిసి ఆలశ్యం చేయకుండా వచ్చేశాడు చంద్రం.

"చంద్రం... చూడబోతే అమ్మాయికి నొప్పులు ఆరంభించాయనుకుంటాను. ఏం చేయాలో తోచటంలేదు."

"ఇందులో ఆలోచించేందు కేముంది... హాస్పెటల్‌కి తీసుకెళదాం" అంటూ పాలేర్ని కేకేసి, "భద్రయ్యా ! నువ్వు కరణంగారింటి కెళ్ళి, చంద్రం బాబుగారు అర్జెంట్‌గా జీప్ ఇవ్వమన్నారని చెప్పు. డ్రైవర్ లేడని చెబితే, నేనే వచ్చి తీసుకెళతానని చెప్పు... పో! త్వరగా వెళ్ళు ఇక్కడున్నట్లు !"

దీప బాధ ఏమి తగ్గలేదు. అలా వుండుండి మూలుగుతూనే వుంది. ఎందుకైనా మంచిదని చంద్రం, తన బండిని కూడా సిద్ధం చేసాడు. ఈలోగా భద్రయ్య పరిగెత్తుకొచ్చాడు.

"బాబు, ఆ అయ్య ఇయ్యనన్నారండీ."

"నే చెప్పినట్లు చెప్పావా ?"

"ఆ సెప్పానండి! మా జీపుంది, వూళ్ళో అడ్డమైన వాళ్ళ కివ్వటానికి కాదు, అని సెప్పమన్నారండి !"

చంద్రం కరణం కక్ష ఎందుకో అర్థమైంది. సరే, ఇప్పుడు ఏది ఏమైనా దీపని హాస్పెటల్‌లో చేర్పటంముఖ్యం, అనుకుంటూ ఆ ఏర్పాట్లు చూసాడు.



దీప శారదమ్మఒళ్ళో తలపెట్టుకొని పడుకొంది. చంద్రం, బండి వెనగ్గా నడుస్తున్నాడు. ఏదురుజల్లు మొహం మీద పడుతోంది. ఉండి ఉండి మెరుపులు ఆకాశంలో జర్రున పాకి పోతున్నాయి. ఆ వెలుగు తప్పించి పెద్దగా వెలుగేమి లేదు. రోడ్డు అంతా తారురోడ్డు కాకపోవటం వలన బండి గుంటల్లో పడుతూ లేస్తూ మెల్లగా పోతోంది. దీవకీ ప్రయాణం నరకానికి నడుస్తున్నట్లుంది. ఆమె బాధ మరింత పెరుగుతోంది. ఇక ఆగలేక—"పెద్దమ్మా ! నేను రాలేను. నన్నిక్కడే వదిలెయ్యండి, కావాలంటే నడుస్తాను" అంటూ భోరున ఏడ్చేసింది. శారదమ్మ కేం చేయలో తెలియలేదు. ఎంత లేదన్నా ఇంకా ఫర్లాంగు దూరం వెళ్ళాలి. ఈలోగా చంద్రం ఒక్కసారి దీపని రెండు చేతుల్లో ఎత్తుకుని గబగబ పరుగులాటి నడకతో ముందుకు నడిచాడు. దీప రెండు చేతులతో అతని మెడ పట్టుకుని "సీతలాగా నేను చచ్చిపోతానేమో ! ఆమె కయినట్లే నాకు అయిందే" అంది భీతిగా.

"ఛ...ఛ...నువ్వెక్కడపిల్లవు. ధైర్యంగా వుండు. ఇంకో అరగంటలో హాస్పటల్ చేర్చే బాధ్యత నాది." అంటూ నడక వేగాన్ని హెచ్చించాడు. వాన ఎడాపెడా కొడుతున్నా లెక్కచేయలేదు. అతను మెయిన్ రోడ్ ఎక్కేసరికి అక్కడ టాక్సీలు, ఆటోలు ఏమి లేవు. అయితే దూరంగా రోడ్డుమీద లైట్స్ కనిపించాయి. చంద్రం దేముడి మీద భారం పెట్టి రోడ్డు అడ్డంగా నిలబడ్డాడు. క్రమంగా ఆ లైట్స్ దగ్గరకొచ్చి ఆగిపోయాయి. అది విజయవాడే వెళుతున్నకారు. అందులో ఆట్టే జనం లేరు. చంద్రం తన పరిస్థితి వాళ్ళకు వినయంగా చెప్పుకున్నాడు. ఏ కళ నున్నారో, వాళ్ళు చంద్రం కోరిక మన్నించి తమ కారులో చోటు ఇచ్చారు. ఈలోగా బండి కూడ వచ్చేసింది. వెనకసీటులో దీప, చంద్రం, శారదమ్మ కూర్చున్నారు. కారు విజయవాడ వైపు పరుగు తీసింది.

దీపను హాస్పెటల్లో అడ్మిట్ చేస్తూనే లేడీ డాక్టర్‌కి ఫోన్ చేసాడు చంద్రం. లేడీ డాక్టర్ వచ్చేసరికి అప్పుడు నైట్‌డ్యూటీలో వున్న డాక్టర్ ఇంజెక్షన్ చేసింది. అయినా దీప మెలికలు తిరుగుతూ బాధ పడుతూనే వుంది. డాక్టర్ వస్తూనే దీపని పరీక్షచేసి, అర్జెంట్ ఆపరేషన్‌కి సిద్ధం చేయమంటూ పురమాయించింది. శారదమ్మ కేం జరుగుతోందో అర్థం కాలేదు. కనీళ్ళతో చంద్రం వంక చూసింది. చంద్రం కళ్ళతో మరేం ఫరవాలేదన్నట్లు ధైర్యం చెప్పి, ఎందుకైనా మంచిదని లేడీ డాక్టర్‌ని అడిగాడు, "దీప కేం ఫరవాలేదు కదా !" అంటూ.

ఆమె బలవంతంగా నవ్వి, "ఫరవాలేదు. ఆపరేషన్ చేయాల్సి వచ్చేలా వుంది. ముందు మీరీ పేపర్‌మీద సైన్ చేయండి." అంటూ ఒక పేపర్ ముందుంచింది. అర్థం గానట్లు చూసాడు చంద్రం.

"మరేం లేదు. మీ మిసెస్‌కి ఆపరేషన్ చేస్తున్నాంగా! అందుకు మీ సమ్మతి."

"అనవసరంగా ఈ పాప ఫలానికి తండ్రి వౌతున్నావు..." అన్న దీప మాటలు గుర్తు వచ్చి చిన్నగా నవ్వు వచ్చింది. మాట్లాడకుండా సైన్ చేసి ఇచ్చేసాడు.

దీపని ఆపరేషన్ థియేటర్‌కి తీసుకువెళ్ళే సరికి మరో అరగంట పట్టింది. ఈ లోగా దీప బాధని చూడలేక పోయారు.

"దీప కూడా సీతలాగా..." అప్పైన ఊహించుకోలేక పోయాడు చంద్రం. అతని గొంతులో ఏదో అడ్డు పడ్డట్టయింది.

శారదమ్మ దుఃఖం లోపల దాచుకోలేక పోతోంది. ఎంతో నమ్మకంతో చెల్లి దీప భారాన్ని తనమీద వుంచింది. ఏదైనా అయితే తన మొహం చెల్లెకి చూపించలేదు.

"బాబూ! దీప ఈ గండం గడిచి గట్టెక్కుతుందా ?" వుండబట్టలేక అడిగింది శారదమ్మ.

'మరేం ఫరవాలేదమ్మా! చిన్న ఆపరేషనే! భయంలేదు.' అంటూ ధైర్యం అయితే చెప్పగలిగాడు కాని చంద్రానికి మనసులో భయం లేకపోలేదు. హాస్పటల్ అంతా నిశ్శబ్దంగా వుంది. వర్షం పూర్తిగా వెలిసి

పోయింది. ఇంకా తెల్లవారటానికి ఆట్టే వ్యవధి లేదు. చంద్రం మాటి మాటికి టైమ్ చూసుకుంటున్నాడు. వానకి తడిసిన రిస్ట్‌వాచ్‌లో మసక మసకగా కనిపించాయి ముళ్ళు. శారదమ్మ మోకాళ్ళమీద తలపెట్టుకొని దేముడిని ప్రార్థిస్తూ కూర్చుంది.

ఇంతలో థియేటర్ తలుపు తీసుకొని లేడీ డాక్టర్ బయటకొచ్చింది. చంద్రం ఆత్రుతగా ఆవిడ ఏం చెప్పబోతోందో! అనుకుంటూ భయంగా చూసాడు.

"హార్టీ కంగ్రాచులేషన్ మిస్టర్ చంద్రశేఖర్! యుగాట్ ఏ మేల్ ఛైల్డ్! చాలా హెల్దీగా వున్నాడు."

"దీప, దీప కెలావుంది డాక్టర్"

"షి ఇజ్ ఆల్‌రైట్. బాగా రెస్ట్ కావాలి. కాని మీరొకసారి ఇటురండి."

ఈ సంతోష వార్తని శారదమ్మకి చెబుదామని వెనక్కి తిరిగిన వాడల్లా డాక్టర్ మాటలకి ఆశ్చర్యంగా చూసాడు.

"సారీ! ఈ విషయంలో మీకు బాధ కలిగించవచ్చేమో! కాని బాడ్‌లక్. ఆమె తల్లి అయ్యే ఛాన్సెస్ ఇంక లేవు" లేడీ డాక్టర్ జాలిగా అతని వంక చూసి వెళ్ళిపోయింది.

దీపకి విషయం తెలిస్తే ...!

ఎందుకిలా జ రి గిం ది. తనకు తెలియకుండా జరిగిన పొరపాటుకు భగవంతుడు ఆమెను కఠినంగానే శిక్షించాడా!

"బాబూ! దీప కేమైంది. డాక్టరుగారు ఏం చెబుతున్నారు. నువ్వేమిటి వులుకు పలుకు లేకుండా అలా వుండి పోయావు..." శారదమ్మ ఖంగారుగా కదిలించింది చంద్రాన్ని.

"అబ్బే! ఏం లేదమ్మా. దీపకు మొగపిల్లవాడు పుట్టాడట. ఇద్దరూ క్షేమమే!"

"అమ్మయ్య" అంటూ కొంగు తీసుకొని మొహం తుడుచుకొని "అయితే మనం వెళ్ళి చూడచ్చా."

"వద్దమ్మా, దీపకి రెస్ట్ అవసరం."

నర్స్ ఈలోగా తెల్లని బట్టలలో చుట్టిన బాబుని థియేటర్ నుంచి మరొక రూమ్‌కి తీసుకుపోతూ వారికి చూపించింది.

నల్లని జుట్టు, గులాబి రంగులో మిసమిసలాడుతూ, కళ్ళు మూసుకొని చాలా ముద్దుగా వున్నాడనుకొన్నారు.

(ఇంకా వుంది)

## హైదరాబాదు నోట్‌బుక్

**"జన్మాంతర వైరం" ఆవిష్కరణ :**

డాక్టర్ బోయి భీమన్న సప్తతి పూర్తి చేసు కొన్న నవయువకుడు. నవకవులతో పోటీ పడుతూ కావ్యాలు వ్రాసి పారేస్తున్న సాహిత్య విరిశ్రామి కుడు. ఆయన ఇటీవల వ్రాసిన కావ్యం జన్మాంతర వైరం ఆవిష్కరణ అక్టోబరు 8వ తేదీన శ్రీకృష్ణ దేవరాయ ఆంధ్ర భాషా నిలయంలో జరిగింది. ఒక హరిజన బాలుడు దారి తప్పి అగ్రహారంలో ప్రవే శించడం, అక్కడి అగ్రవర్ణాలు అతనిని కొట్టి చంపడం అతని ప్రేతాత్మ తన దైన్యాన్ని వెళ్ల బోసుకోవడం ఈ కావ్యం ఇతివృత్తం. శ్రీ భీమన్న స్వయంశక్తివల్ల పైకి వచ్చినవారని, ఆయన సాహి త్యానికి షష్టిపూర్తి చేసుకున్నారని, సమాజంలోని క్రౌర్యాన్ని ఎదిరించడం, చిత్తశుద్ధి, గాఢ ఆలోచన, నిర్ణయం ఆయన వైయక్తిక, సాహిత్య ధర్మాలని ఆవిష్కరణ సభకు అధ్యక్షత వహించిన శ్రీ దేవుల పల్లి రామానుజంరావు అనగా, భీమన్న జీవితం నడిచే నిట్టూర్పు. సంఘం నుంచి చిల్చుకువస్తున్న దావాగ్ని స్ఫులింగాలు. రక్తపు సెగలు కలబోస్తే తయారయిన వ్యక్తి భీమన్న. వర్తమానంలో భవి ష్యత్తును వ్రాసేవాడు భీమన్న. వేదం ఇప్ప టికీ ఎలా లేతగా ఉన్న పాతదో అలాటివాడు భీమన్న. నడిచే కవిత్వం భీమన్న పలికే తత్త్వం భీమన్న- అని కావ్యాన్ని ఆవిష్కరించిన డాక్టర్ సి. నారాయణరెడ్డి ప్రశంసించారు. డాక్టర్ దివాకర్ల వెంకటావధాని కావ్య పరిచయం చేశారు. రాష్ట్ర కార్మిక శాఖ మంత్రి శ్రీ జి. వెంకటస్వామి ప్రసం గిస్తూ శ్రీ భీమన్న హరిజన గిరిజనుల కష్టాలను ఆలోచించే కవి అన్నారు. శ్రీ కె. వి. భాస్కరరావు, వ్యాయమూర్తి శ్రీ కె. పున్నయ్య కావ్యాన్ని ప్రశం సించారు.

**నూతన ముఖ్యమంత్రి శ్రీ అంజయ్య :**

ఆరునెలలుగా రాష్ట్ర రాజకీయ రంగంలో ముసిరిన కారుమబ్బులు విడిపోయాయి. శరదృతువు ప్రవేశంతోనే అక్టోబరు 11న శ్రీ టి. అంజయ్య నూతన ముఖ్య మంత్రిగా ప్రమాణ స్వీకారం చేశారు. శ్రీ అంజయ్య కేంద్ర ప్రభుత్వం కార్మిక శాఖ సహాయ మంత్రిగా విజయవంతంగా తమ విధులు నిర్వహించారు. శ్రీ అంజయ్య నగరంలోని ఆల్విన్ ఫ్యాక్టరీలో అరణాల కూలీగా జీవితాన్ని ప్రారంభించి, కార్మిక నాయకుడై, నేడు రాష్ట్ర ముఖ్య మంత్రి పదవికి ఎదిగిన వ్యక్తి. అందరు మహా నాయకులలాగే ఆయన కూడా తల్లి చేతి చలవతో పెరిగిన వారు. ఆల్విన్ ఫ్యాక్టరీలో చేరిన పిదప ఆయన కార్మికోద్యమంలో చేరి కార్మిక సంఘాలకు అధ్యక్షుడయ్యాడు. పిదప హైదరా బాద్ స్టేట్ కాంగ్రెస్‌లో చేరి, డాక్టర్ జి. ఎస్. మేల్‌కోటే నాయకత్వంలో ఇండియన్ నేషనల్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ రాష్ట్ర శాఖను స్థాపించారు. పెక్కు సమ్మెలకు నాయకత్వం వహిం చారు. 1952 నుంచి 1958 వరకు ఆ శాఖకు అధ్యక్షుడుగా ఉన్నారు. పిదప ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ సంఘం ఉపాధ్యక్షుడ గా తెలంగాణా ప్రాంతీయ కాం గ్రెస్ సంఘం అధ్యక్షుడుగా ఉన్నారు. 1973 లో జపాన్ వెళ్లి అక్కడి కార్మికుల పరిస్థితిని పరిశీలించారు. 1957లో నిజామాబాద్ జిల్లా ఆర్మూరునుంచి తొలిసారిగా రాష్ట్ర విధాన సభకు ఎన్నికయ్యారు. పిదప ముషీరాబాద్ నుంచి రెండు సార్లు ఎన్నికయ్యారు. పి. వి. నరసింహారావు మంత్రి వర్గంలోను, వెంగళరావు మంత్రి వర్గంలోను, కార్మిక మంత్రిగా ఉన్నారు. 1978లో రాజ్య సభకు ఎన్నికయ్యారు. పిదప కేంద్రంలో సహాయ మంత్రి అయ్యారు. శ్రీ అంజయ్య కడు పేద స్థితి నుంచి పెద్ద స్థితికి వచ్చిన వాడు కాబట్టి సంఘంలోని అన్ని వర్గాలకు న్యాయం చేకూర్చ గలడనే ఆశించవచ్చు. ఆయన వినయ సంపత్తి, ప్రవర్తన ఆ ఆశ అడియాస కాదని నిరూపిస్తు న్నాయి.

**తాతా సుబ్బరాయశాస్త్రి సంస్మరణ :**

తమ పాండిత్య వైదగ్ధ్యంతో తెలుగునాడును సువాసితం చేసి, ఆత్మగౌరవంతో తెలుగు విద్వన్మం డలి కీర్తి నిలపెట్టి సహస్రసంఖ్యలో విద్వాంసులను రూపొందించిన మహా మహోపాధ్యాయ తాతాసుబ్బ రాయశాస్త్రి మహోదయుల సంస్మరణసభ సాహిత్య అకాడమీ సెప్టెంబర్ 7వ తేదీన శ్రీకృష్ణదేవ రాయాంధ్ర భాషా నిలయంలో తెలుగు వైతా ళికులు శీర్షికకింద జరిపింది. సుప్రసిద్ధ విద్వాం సులు తాతా వారి శిష్యులు, శ్రీ జమ్మల మడక మాధవరామశర్మ సంస్మరణ ప్రసంగం చేశారు. శాస్త్రిగారు అలంకార శాస్త్రానికి, గురు ప్రసాద వ్యాఖ్యానంతో వ్యాకరణ శాస్త్రానికి చేసిన సేవను, జైవతత్త్వ గ్రంధాల ప్రవేయకుల మార్తాండం వంటి వాటిని అన్వయించడంలో ఆయనకు గల ప్రతిభను శ్రీ శర్మ వివరించారు. తాతా ఇప్పటి పండితులకు చేసిన ఉపదేశం యాదవ బియువద్దు. పాండిత్యాన్ని తెలుగు దేశానికి వినియోగించండి, అని ప్రారంభంలో అకాడెమీ కార్యదర్శి శ్రీ ఐరి వెంటి కృష్ణమూర్తి తెలుగు వైతాళికులు శీర్షిక ఉద్దేశం వివరించారు. అధ్యక్షులు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి తాతావారి పాండిత్యాన్ని వివరించారు. శ్రీ పొద్యారం జగన్నాథం వందన సమర్పణ చేశారు.

**ఉపశ్రుతి :**

"ఏమిటి కవిగారూ, ఏమిటో వర్ధ్దతున్నారు?" అనడిగాను, పాత పుస్తకాల కట్టలు దులుపుతున్న ఒక కవిని. "ఆ! ఏముంది? ముఖ్య మంత్రి మారా డుగా! పాత హారాలు బైండు చేయించి పీఠిక వ్రాసి అంకితమిస్తే పోతుందిగదా అని వర్ధ్దతున్నా" అన్నాడు. "భలే వారండి మీరు! మిత్రులు గుండవరపు సత్యనారాయణరావు (రాయరు, భువన గిరి) చెప్పిన ఒక సంగతి జ్ఞాపకం వస్తున్నదండి. ఒక శిల్పి నాయకుల తలకాయలు, నమస్కార భంగిమలో ఒక మొండెం మాత్రం మలచాడట. ఏమిటి శిల్పిగారూ, వట్టి తలకాయలే ఎందుకూ? అని అడిగితే, బాబూ ఆ మొండానికి సమయానుకూలంగా తలకాయలు తగిలిస్తే పోలా? ప్రతి దానికీ మొండాలెందుకూ? అన్నాడట. మీరూ అలాగే పాత హారాలు బైండుచేయించి ఒక ఆముఖం వ్రాసి, వచ్చే వాడి ముఖాన కొట్టదలచారు అని అన్నాను. పాపం! ఆ కవిపుంగవుడు ఏమనుకున్నాడో ఏమో?

—తిరుమల రామచంద్ర



# నమ్మలేని నిజం లేక అసాధారణ హత్య

"మీ పేరు, మీ వయస్సు?" కోర్టులో పబ్లిక్ ప్రాసిక్యూటరు ప్రశ్న.

"పేరు సీత, వయస్సు పాతికేళ్ళు" బోనులో వుండి సీత సమాధానం.

"మీ మీద వున్న కోర్టువారి అభియోగం తెలుసా?"

"తెలుసు—నా భర్తని హత్య చేశానని" సీత ధైర్యంగా చెప్పింది.

"చేశారా మరి" న్యాయవాది ప్రశ్న.

"అవును. నేనే నా భర్త రాముగారిని హత్య చేశాను" సీత చెప్పింది.

"కారణం ?" లాయరు ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

"కారణమేమిలేదు. నేను శివగోపాల్ అనే వ్యక్తిని ప్రేమించాను. మేము పెండ్లి చేసుకోవాలనుకుంటున్న సమయంలో రాముగారు సంపన్నుడు కావటంచేత, మా తల్లిదండ్రులకు, డబ్బు ఆశ చూపి నన్ను బలవంతంగా పెండ్లి చేసుకున్నారు. పెండ్లి అయి పది సంవత్సరాలు దాటినా నాకు నా ప్రేమికుడు శివగోపాల్ మీద వ్యామోహం తగ్గలేదు. రాముగారితో యాంత్రికంగా సంసారం చేసే నాకు, అతన్ని అంతంచేసి శివగోపాల్‌ని పెండ్లి చేసుకోవాలనిపించింది." సీత సమాధానం చెప్పింది.

"అయితే హత్యానేరం ఎలా తప్పించు కుందామనుకున్నారు?" లాయరు ప్రశ్న.

"మొదటే చెప్పానుగా. రాముగారి శవం చుట్టు చిందరవందరగా డబ్బు పారవేశాను. డబ్బుకోసం ఎవరో హత్యచేసి పారిపోయారని రిపోర్టు యిచ్చాను. కాని మా యింట్లో దొరికిన లవ్‌లెటర్సు ఆధారంగా నన్నే అనుమానించి అరెస్టు చేశారు పోలీసులు. చేసేది




లేక అందరి నేరస్తులలాగా నేను అసలు కథనం వివరించాను'' అంది సీత. ఆమె గుండె బండబారిపోయినట్లనిపించింది చూసే వారికి.

''రాము చాలా బలమైనవాడు కదా! నీవు ఒక్కతివే అతన్ని చంపడం అసాధ్యం. నీకు మరియొక వ్యక్తి సహాయం చేశాడని నా అనుమానం.'' జస్టిస్ జగన్ సీతను పరీక్షగా చూస్తూ, ప్రశ్న వేశారు.

''నేనే చంపాను. అతను బలం కలవాడే కాని నేను చంపిన విధానం సరిక్రొత్తది. అందుచేత తేలికగా చంపగలిగాను.'' సీత నేరంలో ఒక క్రొత్త విషయాన్ని చెప్పింది, కోర్టువారికి.

''సరే, మీరు చంపిన విధానాన్ని వివరించండి.'' జస్టిస్ జగన్ అడిగారు,ఆతృతగా.

''అతనిని చంపాలనే వుద్దేశ్యం కలిగిన నాటి నుండి చాలా ప్రేమగా వ్యవహరిస్తున్నాను. అతను నా మాయలో పడ్డాడు. అంతే,'' అంది సీత. వారి గత జీవితంలోని కొన్ని ఘట్టాలను ఫ్లాష్‌బ్యాక్‌లో వివరించింది.

''ఏమిటి సీతా! చాలా వుషారుగావున్నావ్'' రాము బయట నుంచి వస్తూనే అడిగాడు.

''ఏమీలేదు. ఈరోజు శ్రీవారిని చిత్తుగా మురిపించాలని.'' రెండు బుజాలమీద చేతులు వేసి, మోములో మోము పెట్టింది సీత.

''చాలా ఎమోషనల్‌గా వున్నావు సీతా,'' అన్నాడు రాము.

''అవునండీ! యీరోజు ఒక సెక్సు బుక్ చదివాను. అది చదివిన దగ్గర నుండి అదోలాగుంది. ఇకమీదట ఎప్పుడు చదవకూడదు బాబు.'' అదోలా మూతిపెట్టి పమిట తన చేతిలోకి తీసుకుంది, ఒయ్యారం ఒలకబోస్తూ సీత.

మళ్లీ పమిటను యధాస్థానంలోకి వెళ్లకుండా రాము తీసుకున్నాడు. ''అలాంటి పుస్తకాలు యికమీదట కూడా చదువు సీతా! యివాళ చాలా హుషారుగా వున్నావు. ఎందుకో అనుకొన్నాను. వాటో సరదా సృష్టించావ్! నాక్కావలసింది కూడా యిదేగా,'' రాము మెచ్చుకోలుగా అన్నాడు.

అతనిని ఆమె పెనవేసుకు పోయింది. అతని వంటిమీద వున్న సగం బట్టలు తీసి, అవతల పారవేసింది. ఆమె కూడా లోపలి దుస్తులలో నిలబడింది. గత కొద్దిరోజులుగా, సీత ప్రేమకు నోచుకోని రాముకి ఆ మధుర క్షణాలు, మిగిలిన ఆలోచనలను నశింపజేశాయి. అతని ఆనందానికి పగ్గాలు లేవు.

''అదికాదు డియర్! యీ రోజు నేను సెక్సు పుస్తకంలో చదివినట్లు మనం, శృంగార క్రీడలు చేయాలి— నా కోర్కె తీర్చరూ'' అతని గడ్డం పట్టుకుని బతిమాలినట్లు అడిగింది సీత.

''స్వర్గాన్ని చూపెడతానని నీవంటే, అదృష్టాన్ని కాలదన్నుకునే అంత అవివేకినా డియర్'' అన్నాడు రాము.

''సరే,నీయిష్టం చెప్పు'' అన్నాడు రాము.

దూరంగా పెద్ద మంచం మీద పరుపు వేసింది. ''ఆ పరుపు మీద పడుకోండి. నేను మీ కాళ్లు, చేతులు కట్టివేస్తాను. అప్పుడు నేను మీ మగసిరి గొప్పతనం చూస్తాను. సరేనా'' అతని ముఖాన్ని తన గుండెలకు హత్తుకుంటూ ఆశపెట్టింది సీత.

''సరే, నీ యిష్టం'' అని ఆమె చెప్పినట్లే పడుకున్నాడు. బలమైన తాళ్లతో కట్టింది అతని కాళ్లూ చేతులు. అలా చేయబోయే ముందు అతను త్రాగే పానీయంలో మత్తుమందు కలిపింది. వెంటనే అతని ముక్కు, చెవులు కోసివేసింది. అంతే!అతను చచ్చిపోయాడు !

*   *   *

కోర్టువారికి జరిగిన కథను వివరించింది సీత.

ఎందుకో యిదంతా ఒక కట్టుకథగా తోచింది జస్టిస్ జగన్‌కి.

కోర్టు విచారణ మరుసటిరోజుకి వాయిదా వేశాడు.

మర్నాడు, ''శివగోపాల్ ఒక్కడేకాదు,నీకు

# నమ్మలేని నిజం...

గోవర్ధన్ అని మరియొక స్నేహితుడు కూడా వున్నాడు. అవునా?'' ప్రాసిక్యూటర్ ప్రశ్న.

''అతను ఎవరో తెలియదు'' ముక్తసరిగా సీత సమాధానం.

''ఈ లెటరు చదవండి'' అమెకిచ్చాడు ఒక వుత్తరాన్ని లాయరు.

''ఎప్పుడూ మీ వళ్లోనే వుండమంటే ఎలా చెప్పండి? వివాహితను. సంఘం కట్టిన అడ్డుగోడలు తొలగించేవరకు ఆ ముసుగులో వుండక తప్పదు. అయినా అదేమిటండీ, యింట్లోకి వచ్చి రావటంతోటే మీరు దిగంబరులు కావటంకాక, నన్నుకూడా బలవంతంగా అట్లా అయిపోవాలంటారు? ఎవరైనా వస్తే అన్నీ సర్దుకోవటం ఎంత కష్టం చెప్పండి! రాముగారు వచ్చారనుకోండి, మీరు నా స్నేహితుడని చెప్పగలను. కాని బట్టలు కట్టుకోవటానికి పదినిముషాలు అయినా పడుతుంది కదా! అయినా అర్ధనగ్నంగానే అతనికి దర్శనమిస్తే అనుమానం రాదూ! పైగా త్వరలో మీరు సహాయం చేస్తానన్నారుగా! అతనికి పైనించి పిలుపు వస్తే, మీదాననవుతాను. సరేనా? అందాకా ఆగలేరా'' అలా సాగింది ఆ లెటరు.

''మీదేనా యీ వ్రాత'' లాయరు ప్రశ్న.

''అవును నాదే! అతను నా స్నేహితుడు. ''గిరి'' అని పిలుస్తాను. అందుచేత గోవర్ధన్ అంటే నాకు మొదట అర్థంకాలేదు. అసలు పేరు ''గోవర్ధన్ గిరి'' అనుకుంటాను'' సీత భయపడకుండానే జవాబు చెప్పింది. కోర్టు ముక్కున వేలు వేసుకుంది.

''గోవర్ధన్ కూడా నీకు యీ హత్యలో సహాయపడ్డాడని మా అనుమానం'' జస్టిస్ అడిగాడు.

''లేదండీ! నేనే చేశాను'' సీత నిబ్బరంగా సమాధానం చెప్పింది.

''మీరు నిజం చెప్పాలి. మరియొక నేరస్థుణ్ని వదిలివేయటానికి నా మనస్సు అంగీకరించటంలేదు. ఒక వాయిదా యిస్తున్నాను'' సీరియస్‌గా చెప్పారు జస్టిస్ జగన్!

ఏంతైనా సీత మాట మార్చటం లేదు.

గోవర్ధన్‌ని కూడా అరెస్టుచేసి కోర్టుకి తెచ్చారు.

గోవర్ధన్‌కి, సీత వ్రాసిన లేఖలోని ఒక చిన్న మాట ఆధారంగా సీతకు, గోవర్ధన్‌కీ పురిశిక్ష వేశారు జస్టిస్ జగన్.

(51వ పేజీ చూడండి)


Nestlé
NESCAFÉ
instant coffee

**"ఏమేవ్, ఇది విన్నావా ? !"—ఇంటికి వచ్చిన వరదయ్యగారి పిలుపు సంభ్రమంగా వినిపించింది ఆవేళ సాయంత్రం.**

"ఏం వినమంటారండీ, అవతల వంట ఇంటి గోడ పడిపోవటానికి సిద్ధంగా ఉంది... ఇందాక రెండు పెద్ద పెళ్ళు విరిగిపడ్డాయికూడాను... ఏదో మన అదృష్టం బావుండబట్టి ఆ గట్టుమీది జాడీలు పగలలేదు..." అంది రేణుకమ్మ, ఇవతలికి వచ్చి తన సహజధోరణిలో.

"వెధవజాడీలు... పగిలిపోతే పగిలిపోయినయ్ లేవే..." మరేదో చెప్పబోయిన ఆయనకు టక్కున అడ్డుపడింది రేణుకమ్మ, "వెధవజాడీలా !... పగిలిపోతే పగిలిపోయినయ్యా ! అందులో ఒక్కటి పగిలిపోయినా మనం తిరిగి కొనగలుగుదుంటండీ !... మొదట్నుంచి మీది వైరాగ్యమే... ఇన్ని కబుర్లు చెబుతారుగాని శిథిలావస్థలో ఉన్న మన ఇంటిని గురించి ఆలోచించరేం ?" అంటూ.

"చేతిలో తడిలేనప్పుడు వేటినిగురించి ఆలోచించి మాత్రం ప్రయోజనం ఏమిటి ?... అసలు ఈ ఇల్లు ఈనాటిదా ?... అవన్నీ ఎందుకు ?... రోజూ మువ్వు ఇంటిని గురించి మాట్లాడటం — నేను వినుక్కోవటం మనకు అలవాటేగా ?... ఇంతకూ నేను చెప్పదలుచుకున్న శుభవార్త వేరు" అంటూ అసలు విషయంలోకి వచ్చారు వరదయ్యగారు.

"ఏమిటండీ, అంత శుభవార్త !"— అంతలోనే తొందరపడింది రేణుకమ్మ.

"మన రామం ఈ ఊరు వచ్చాడు... వాడికి ఇక్కడికే ట్రాన్స్‌ఫర్ అయిందట !... ఇందాక బజార్లో కనిపించాడు. రేపు మన ఇంటికి వస్తానన్నాడు."

భర్త మాటలకు మొదట రేణుకమ్మ ముఖం వికసించినట్లైనా అంతలోనే ముకుళించుకుపోయింది.

"తాను ఈ ఊరు వస్తున్నట్లు ఉత్తరం ముక్కైనా రాయలేదు... వచ్చినవాడు సరాసరి మన ఇంటికే రాకుండా ఎక్కడో దిగటం ఏమిటి ?... రేపు చుట్టపుచూపుగా మన ఇంటికి వస్తాడా !"

"నేనూ అదే అడిగాను... వాడి భార్య తరపు బంధువులది ఇల్లు ఖాళీగా ఉంటే — సరంజామాతో సహా రావటంమూలాన అక్కడే దిగాట్ట... భార్య, పిల్లడు కూడా వచ్చారట." అన్న భర్త మాటలు విని ఊరుకొంది రేణుకమ్మ.

రామం వరదయ్యగారి తమ్ముడి కొడుకు... తమ ఒక్కగానొక్క కొడుకు శ్యాంప్రసాద్ అకస్మాత్తుగా పోయినతర్వాత రామాన్ని తీసుకువచ్చి తమదగ్గిరే ఉంచుకున్నారు... అతడికి రెండేళ్ళపాటు చదువుకూడా చెప్పించారు. అంతేకాదు 'నీ కొడుకును దత్తత చేసుకుంటాను ఇచ్చెయ్యరా' అని అన్నాడు తమ్ముడు శేషయ్యతో. కానీ, ఏవో సాకులు చెప్పి అలా ఏమీ జరగనీయలేదు అతడు... రామం మీదికి పోయినట్లు వరదయ్య దంపతుల మనసు మరొకరి మీదికి మళ్ళలేదు ఆ తర్వాత.

తమ దగ్గిరే కొంతకాలంపాటు పెరిగిన రామం ఆ ఊరే రావటం — మొత్తానికి ఆ వృద్ధ దంపతులకు ఆనందమే అనిపించింది.

"ఏమిటి మాస్టారూ, విశేషాలు ?" అంటూ అప్పుడే లోపలికి వచ్చాడు విశ్వం.

ఎదురింట్లో ఓ వాటాలో అద్దెకు ఉంటున్నాడు విశ్వం. అతడికి 'నా' అన్న వాళ్ళెవరూ లేరట ... వరదయ్య దంపతుల దీన పరిస్థితి తెలుసుకున్నది మొదలు — వాళ్ళంటే జాలిఏర్పడింది. ప్రతి ఉదయం, సాయంత్రం పనికట్టుకొనివచ్చి వాళ్ళ యోగక్షేమాలు అడిగివెళ్తాడు. అతడంటే వరదయ్య దంపతులకూ మంచి గురి ఏర్పడింది.

* * *

"ఏమండీ ! ఆ ముసిలాళ్ళు మీరంటే పడి చస్తున్నట్లు కనిపిస్తున్నారు. నిజంగా అది ఆపేక్షే నంటారా ?" — వరదయ్యగారి ఇంటినుంచి బయలుదేరి, రిక్షా కొంతదూరం వచ్చాక అడిగింది శశిరేఖ.

"కావచ్చు ... శ్యాము అన్నయ్య పోయాక నేనుకొంతకాలం వాళ్ళదగ్గిరే పెరిగాను చిన్నప్పుడు..." అని చెప్పాడు రామం.

"మన పెళ్ళై మూడేళ్ళైంది !...మరి ఇంత



కాలం నేను ఎరుగని ఈ అనురాగాలు, అభిమానాలు ఒక్కసారిగా పెల్లుబికి ఎలా వచ్చాయో ఇప్పుడు ?''

సమాధానం చెప్పలేకపోయాడు రామం శశిరేఖకు.

''అసలు విషయమేమిటో నన్ను చెప్పమంటారా ? — ఈ ప్రేమలు, మమకారాలు అనేవి శుద్ధ బద్ధం...ఆ ముసివాళ్ళు ఆలోచించేదేమిటంటే— ఈ చివరిరోజుల్లో తమకు దిక్కూమొక్కూ లేకుండా పోయింది ... ఏదో ఉద్యోగం చేసుకొంటూ మీరు కొంచెం పచ్చగా కనిపిస్తున్నారు కదా ? ... అటువంటి మీమీద అభిమానం కనబరిస్తే — మీరు తేలిగ్గానే లొంగిపోతారు ... రేపు ఏ రోగం రొష్ఠూ వచ్చినా మీరే చూసుకోవాలి ... వాళ్ళు హాయిగా రోజులు వెళ్ళమార్చుకుపోతారు.''

భార్యమాటలు విన్నాక 'వాళ్ళు అలాంటివాళ్ళు కాదు ... ఈ మూడు సంవత్సరాలుగా మనదగ్గిరికి రాలేదంటే అందుకు పెదనాన్నవాళ్ళ ఆర్థిక పరిస్థితులే కారణం ...' అందామనుకున్నాడు. కానీ, అనలేకపోయాడు.

''మీరు లేనిపోని బాధ్యతలు తగిలించుకోకండి... మనం ఇద్దరం అయితేనే — ఈ పసివాణ్ణి పెట్టుకొని ఇంటిపని — వంటపని చేసుకోలేక చస్తున్నాను ... ఇప్పుడు చొరవ ఇచ్చారంటే రేపు వాళ్ళు వచ్చి మన్నెత్తినే ఎక్కుతారు ... ఏదో మనం ఆ ముసిలాళ్ళకు సేవచేసినా తర్వాత మనకు మిగిలేదేమిటి...? ఆ పాడుబడ్డ కొంప, ఆ కాస్త స్థలమే కద ? ... అయినా ఎప్పుడో ఏదో వస్తుందని ఇప్పుడు మాత్రం నేను తిప్పలు పడలేను బాబూ ... ఎంతైనా తమ్ముడి కొడుకు, వారసులు — వాళ్ళుపోయాక మీకు గాక మరెవరికిపోతుంది ఆ ఇల్లు ?''

'అంతేలే' అన్నట్లు తల ఊపాడు రామం. ఆమెను ఎదిరించే శక్తి అతడికిలేదు మరి.

* * *

వరదయ్యగారు అనుకోకుండాఅస్వస్థులయ్యారు. మంచంలోంచి బొత్తిగా లేవటంలేదు. ఆయన అలా మూలపడ్డాడంటే అది యాదృచ్ఛికం మాత్రం కాదు. సహజం కూడా !

కారణం వయసు ! ఏదో మొండిఘటం అవటం చేత విధి ఎంత వెక్కిరించినా, కాలం ఎన్ని తికమకలు పెట్టినా దృఢంగా నిలబడ్డాడు. డెబ్బై సంవత్సరాల వృద్ధుడైయ్యాక కూడా కష్టపడి పదిమంది పిల్లలకు ప్రైవేట్లు చెప్పి తన కాళ్ళమీద తాను నిలబడుతున్నాడు. తప్పితే ఒకరి ముందుకు వెళ్ళి చెయ్యి చాచటంలేదు... ఒంట్లో జవ వచ్చింది తప్పితే మనిషిలోని ఆత్మవిశ్వాసం ఏమాత్రం సడలలేదు ఇంకా.

''మన యోగక్షేమాలు చూసుకోవలసిన బాధ్యత ఒలవాడు రామం. వాడికి కబురుచేస్తాను'' అంది రేణుకమ్మ.

''కబురుచెయ్యి... చూసివెళ్తాడు... అంతేగాని — ఏదో ఉద్యోగం చేసుకొంటూ — వచ్చే నాలుగు రాళ్ళు చాలక వాడే సతమతమవుతుంటే — మనం వెళ్ళి 'నీ బాధ్యత' అని రామం నెత్తిన ఎక్కటం భావ్యంగా ఉంటుందా ?... ఎందుకు... కొంచెం ఒంట్లో ఓపికరానీ... నా ట్యూషన్స్ నాకే ఉన్నాయి...'' అన్నారు వరదయ్య.

అంతలో ''మాస్టారూ, రిక్షా వచ్చింది... పదండి హాస్పిటల్‌కు వెళ్దాం'' అంటూ లోపలికి వచ్చాడు విశ్వం. విస్మయంగా చూశారు వరదయ్య దంపతులు.

* * *

ఆకాశవాణి గంట గంటకూ తుఫాను హెచ్చరికలు చేస్తోంది క్రితం రోజునుంచీ.

అలాగే ఆ రోజు ఉదయంనుంచి ఓ మాదిరి గాలి, సన్నని చినుకులు ఆరంభమయ్యాయి.

''మాస్టారూ ! ఇది పెద్ద తుఫానుట. నలభై ఎనిమిది గంటలు ఉంటుంది... మీరు ఈ ఇంట్లో ఉంటే లాభంలేదు... పదండి మా ఇంట్లో ఉందురుగాని'' అన్నాడు విశ్వం వర్షంలో తడుసుకొంటూ వచ్చి.

ఒంట్లో కొంచెం స్వస్థత చేకూరినట్లు అనిపించినా — నీరసంవల్ల అంత ఉత్సాహంగా లేచి తిరగలేకపోతున్నారు వరదయ్యగారు.

''ఈ మాత్రం దానికేనా బాబూ... ఎన్ని తుఫానులు, ఉప్పెనలు చూసిందనుకున్నావ్ ఈ ఇల్లు !... ముందు ముందు ఎన్నింటిని చూడబోతోందో ? — ఇప్పుడు మాకొచ్చిన భయమేం లేదు...'' అన్నాడు ధైర్యంగా.

''నిజమే అనుకోండి... అయినా...'' విశ్వం మరేమో చెప్పబోతుంటే రేణుకమ్మ అందుకొంది.

''పంపాలేదులే విశ్వం !... నీవా ఒక్కడివి... ఆయనేమో అన్నమాసం మంచాన్ని వదలటంలేదు... మేముకూడా వస్తే నీకు ఇబ్బంది అవుతుంది నాయనా... అయినా ఎంతటి ప్రళయం వచ్చినా మేం చావం... ఇంతవరకు మొండిగా బ్రతికాం... మరెంతకాలం ఇలా మోడువారి జీవించాలో ?... మా గురించి నీవేం ఖంగారు పడనక్కర్లేదులే విశ్వం'' అంది ఆవిడ.

వాళ్ళ పిడివాదానికి విసిగిపోయి వచ్చినదారినే వెళ్ళిపోయాడు విశ్వం.

* * *

''రామంగారూ... !'' పెద్దగా ధ్వనించింది విశ్వం కంఠం... అప్పుడు బాగా తెల్లవారింది... రెండు రోజులు పట్టుకు పీడించిన పెనుతుఫాను కొద్ది గంటల క్రితమే సద్దుమణిగింది.

అంతకుముందే నిద్రలేచినట్లున్నాడు, తాపీగా బయటికి వచ్చాడు రామం ''ఎవరూ ?'' అంటూ. అతణ్ణి అనుసరించి శశిరేఖ కూడా వచ్చింది... మనిషిని చూశాక, ''ఓహో మీరా విశ్వంగారూ... ఏమిటి విశేషాలు ?'' అడిగాడు.

విశ్వం రామానికి తెలుసు. ఎందుకంటే ఓ పెదనాన్నకు నుస్తీ చేసినప్పుడు రెండుసార్లు వెనికట్టుకొని వచ్చి — ''ఆ వృద్ధదంపతుల బాధ్యత మీరు తీసుకోకతప్పదు'' అంటూ తనకు సలహాలు ఇవ్వబోయాడు...అప్పుడు బాగా పరిచయమయ్యాడు అతడు.

''రాత్రి గాలివానకు మీ పెదనాన్నగారు ఉండే ఇల్లు కూలిపోయింది...'' అంటూ మిగతా వివరాలు చెప్పటానికి నోరు రానట్లు ఊరుకుండిపోయాడు విశ్వం.

''అయితే ... పెదనాన్న, పెద్దమ్మా ... క్షేమమేనావాళ్ళు ?'' — సహజమైన ఆందోళనతో అడిగాడు రామం.

విశ్వం సమాధానం చెప్పటానికి తాత్సారం చేయటంతో శశిరేఖ జరిగినదంతా ఊహించేసుకొంది.

''జరగవలసిందే జరిగిపోయి ఉంటుందండీ ... అత్తయ్య, మామయ్య వృద్ధులు ... పెనుగాలి, కుండపోత వర్షానికి కాలు బయటపెట్టలేకపోయి ఉంటారు ... విశ్వంగారి ధోరణిబట్టి — ఘోరమే జరిగిపోయిందని నా అనుమానం ... అయ్యో ... అత్తయ్యగారూ, మామయ్యగారూ ... ఎంత పని జరిగిపోయింది ... ?'' ఏడుపు లకించుకొంది శశి.

''జరిగిందంతేనా విశ్వంగారూ...'' 'కాదు' అంటాడేమోనన్న ఆశతో కళ్ళనీళ్ళు పెట్టుకొని అడిగాడు రామం.

ఔనన్నట్టు తల ఊపాడు విశ్వం.

''అయ్యో ... పెదనాన్నా, పెద్దమ్మా ... అంటూ తలపట్టుకొని కూలబడిపోయాడు రామం.

కొద్దిసేపటి తర్వాత శశిరేఖ దుఃఖం మరిచి తేరుకొని, ''శిధిలాల మంచి శవాలను బయటకు తీశారా ? ... పోలీసు కంప్లయింట్ ఇవ్వటం కూడా అవసరం ... '' అన్నది.

''పోలీసులు, తహసీల్దారు ... అందరూ వచ్చారండీ ... మీదే ఆలస్యం'' అన్నాడు విశ్వం.

''అలాగా...ఏమండీ, పోయిన వాళ్ళను గురించి మనమూ పోతామా ? ... మీరెంత రోదించినా లాభం లేదు. మనం వెంటనేబయలుదేరాలి ... ఒకసారి లోపలికి రండి ... '' అంది శశిరేఖ రామం చెయ్యి పట్టుకొని.

లోపలికి వచ్చాక, '' .. తుఫానుల్లో ప్రమాదవశాత్తు మరణించినవాళ్ళ తరఫువాళ్ళకు ప్రభుత్వం నష్టపరిహారం ఇస్తుందండీ ! పోయినసారి తుఫానుకు అలానే ఇచ్చారు మా ఊళ్ళో ... డబ్బు చేతికి వచ్చిందికదా అని — అంతా కర్మకాండలకు తగలేసేరు ... ఏదో తూతూ మంత్రం చేసి చక్కావచ్చేద్దాం ... ఇల్లు కూలిపోయినా స్థలం ఉంది బోను మధ్యగా... అంతా మన బుజ్జిగాడి అదృష్టం.'' అంటూ రామానికి చెప్పి మురిసిపోయింది శశి.

* * *

రిక్షాలోంచి దిగకుండానే ''పెద్దమ్మా, పెదనాన్నా ... '' అంటూ గావురుమన్నాడు రామం — కూలిపోయిన ఇల్లు కనిపించాక.

''ఎంత ఘోరం జరిగిపోయిందండీ ... '' అంటూ కూనిరాగాలు తీయనారంభించింది శశి.

''ఏం జరిగిందండీ ... ?''—వింతగాచూస్తూ అడిగారు — కూలిపోయిన ఇంటిని పరిశీలిస్తున్న స్థానికులు.

రిక్షా వెనకే సైకిల్ పట్టుకొని నిలబడ్డ విశ్వం, ''వరదయ్య మాస్టారు, రేణుకమ్మగారు — ఇల్లు కూలి — అందులో కూరుకుపోలేదూ ?'' అన్నాడు . అప్పుడతడి కంఠం అదోలా ధ్వనించింది.

''భలేవాళ్ళే ... '' అంతా నవ్వారు.

''వీళ్ళకు తెలిసినట్టులేదు ... నాతో రండి.'' అంటూ తన గదివైపు దారితీశాడు విశ్వం — అందరూ విస్తుబోయి చూస్తూండగా.

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## రచయితలకు గమనికలు

★ ఆంధ్ర సచిత్ర వారపత్రికకు కథలూ యితర రచనలూ పంపదలచుకున్నవారు సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ—520 003 అన్న చిరునామాకి వ్రాయాలి.

★ కవరుమీద శీర్షిక పేరు పేర్కొనడం మంచిది. రచయితలు తమ పూర్తి పేరూ చిరునామా రచన చివరకూడా స్పష్టంగా వ్రాయాలి— హామీ పత్రం జత చెయ్యాలి.

★ గేయాలు తిప్పి పంపబడవు. వీటి పరిశీలనకు కూడా సుమారు ఏడు నుంచి ఎనిమిది వారాల గడువు అవసరం.

★ కథలుగాని, యితర రచనలుగాని త్రిప్పి పంపబడాలని కోరుకునేవారు— వారి స్వంత చిరునామా గల తగినన్ని తపాలాబిళ్ల లంటించిన కవరు పెట్టడం అవసరం.

★ రచనల గురించి పంపిన వెంటనే గాక ఎనిమిది వారాల తరువాత మాత్రమే వాటిపై నిర్ణయం కోసం ఎదురుచూడడం మంచిది. రచనల గురించి ఉత్తరప్రత్యుత్తరాలకి తావులేదు కాని—తప్పనిసరి పరిస్థితులలో వాటిపై వ్రాయవలసివస్తే రచయితలు— రచన పేరు— అది పంపిన తేదీ, వివరంగా వ్రాయందే, వాటి గురించి పరిశీలించడం కష్టం.

★ మా కార్యాలయానికి రచనలు తెచ్చి ఇచ్చేవారు కూడా పై నిబంధనలన్నీ పాటించాలి. వారికి కూడా స్వంత చిరునామా గల తగినన్ని తపాలా బిళ్ళ లంటించిన కవరు జత చెయ్యాలి అన్న నిబంధన వర్తిస్తుంది.

★ కార్టూన్లు పంపేవారు కూడా 8 వారాలలోగా మా మీద ఉత్తరాల దాడి చెయ్యకూడదు... ప్రతి కార్టూన్ వెనుక పూర్తి పేరు, చిరునామా వ్రాయాలి

★ ప్రత్యేక సందర్భాలుగా వేసిన కార్టూన్ల కవర్ పై ఆ విషయం వ్రాస్తే వాటి పరిశీలన త్వరితంగా జరుగుతుంది.

★ కార్టూన్ల ఎంపిక తరువాత వాటి ప్రచురణ వీలు వెంబడి జరుగుతుంది.

★ రచయితలకు కార్టూనిస్టులకు ఒక్క ఉత్తరాలు, ప్రశ్నావళి, డాక్టర్ సలహాల శీర్షికలో 'వచ్చే' వారికి తప్ప తతిమ్మా అందరికీ; అచ్చైన "ప్రతు"లను— కాలక్రమంలో వాటి పారితోషికాలను పంపుతాము. కాపీలు టపాలో పోయే ప్రమాదం వుంటుందే తప్ప పంపకపోవడం జరుగదు. సం.

## మనుషులు-విలువలు

"ఏరా నాయనా, బ్రతికి ఉండగానే మా కర్మకాండలు ముగించుకుపోదామని వచ్చావా ?" — విశ్వంతోపాటు అతడి గదిలో అడుగుపెట్టిన రామానికి వరదయ్యగారి మాటలు సూటిగా వచ్చి గుండెల్లోంచి దూసుకుపోయినట్లు — అనిపించింది.

ఆ వృద్ధ దంపతులను సజీవంగా చూసిన శశిరేఖకు పెద్ద షాక్ తగిలినట్లైంది.

రేణుకమ్మ — మూగదానిలా ఓ ప్రక్కన కూర్చుండిపోయింది.

"...శ్రమ ఇచ్చినందుకు నన్ను క్షమించండి రాముగారూ!... పెదనాన్న, పెద్దమ్మ నిజంగానే ఆ ఇంటి కప్పు క్రింద పడి నలిగిపోయేవారే... నేను నిన్న ఉదయం వెళ్ళినప్పుడు ససేమిరా కదలం అన్నారు వాళ్ళు అక్కణ్ణుంచి... కాని, రాత్రి గాలి, వాన ఉధృతమయ్యాక మనసు ఆగక వెళ్ళి బలవంతం మీద తీసుకువచ్చాను ఇక్కడికి... చూస్తారు, పెద్దమ్మ మా ఇంటికి వచ్చిన అరగంటలోనే ఆ ఇల్లు కూలిపోయింది... అంతా అదృష్టం అనుకున్నాను. ఆనాడు మీ పెదనాన్నగారు మంచం లోంచి లేవటంలేదని చెప్పినప్పుడు, 'అలాగా ! అయితే తప్పకుండా వస్తాను' అని, నాతో అని — మీరు రానేలేదు... మరి ఈనాడు ? వాళ్ళు ప్రమాదవశాత్తు మరణించారు అని తెలియగానే ఆందోళన వెలిబుచ్చారు. ఒక్కసారిగా బాధ్యత వదిలించుకొంటే పీడ విరగడైపోతుందనే అని వెంటనే బయలుదేరివచ్చారు. ఇక మీ సతీమణిగారి పేరాశకు అంతేలేదు. ఇందాక ఆవిడ మీతో గుట్టుగా చెప్పిన కొన్ని మాటలను నేనూ విన్నాను. మనుషులు, మమతలు కావండీ — ఆస్తిపాస్తులు, నష్టపరిహారాలు — ఇవే మీకు కావలసింది! విలువలు మరిచిపోయిన మీకు తగిన గుణపాఠం చెప్పాలనే నేను కొంచెం నటించవలసివచ్చింది..." అంటూ చాలా ఘాటుగా మాట్లాడాడు విశ్వం.

తనని మోసం చేసిన విశ్వంమీద పట్టరాని కోపం వచ్చిన శశి ఏదో ఆవేశంగా అనటానికి నోరు తెరిచిందో లేదో — రామం చెయ్యి వచ్చి ఆమె చెంపను ఛెళ్ళుమనిపించింది... "ఇక పద..." అన్నాడు ఆజ్ఞాపనగా... భర్తలో వచ్చిన ఈ ఆకస్మిక పరిమార్పుకు నిశ్చేష్టురాలై — భయంగా అతణ్ణి అనుసరించి వెళ్ళి రిక్షాలో కూర్చొంది శశిరేఖ. రిక్షా ఎక్కిన రామానికి మరి దుఃఖం ఆగలేదు.

"ఒరేయ్ నాయనా, రామం... వచ్చి క్షణం కాలేదు... అప్పుడే వెళ్ళిపోవటమేమిటి ?" — వెనుకనుంచి వృద్ధదంపతుల మాటలు వినిపిస్తున్నా— రామంవాళ్ళు ఎక్కిన రిక్షా ముందుకు సాగుతూనే ఉంది.

'తిరిగి రామం తన పెద్దమ్మ, పెదనాన్నలను వెతుక్కొంటూ తప్పక వస్తాడు — ఎందుకంటే విలువలు గుర్తించాడు అతడు' — సంతృప్తి ఫీలయ్యాడు విశ్వం. ●




'దొ<sup></sup>క్క చింపుతా కొడక! పడుకొన్నా' – దోమలుపట్టి పీకుతావుంటే—సిర్రగిర్లినట్టదే పవిగా గీపెడతావున్న బుడ్డాడ్ని గదమాయిస్తూ, బుజంమీదో పోటు పొడిసిన మగదోమని ఎడం చేత్తో పొట్మనొక్కటిచ్చి హత్య చేశాడచ్చాలు. 'పట్టపట్మని మజ్జాన్నం నుంచి కుండల్తో పోసినట్టేదిగా వర్సం కుర్సి గుంటలు నిండటమేంటి, వాసనగొట్టి అందులోంచి ఈగల్లోమలు పాపం పెరిగినట్టు పుట్టుకు రావటమేంటి దొరికినాడ్ని దొరికినట్టు పీకి పాకాన పెడతం మొదలెడతమేందేకదమ్మ్మన సాగిపోచ్చాయ్ నాసామిరంగ. దోమలు పీడిచ్చి రక్కి నిద్రబట్టక బుడ్డలండి కొడుకు ఏక ఏడుపు చెవుల్ల బూరూదినట్టు. పగలల్లా రిచ్చాదొక్కి కునుకు దీద్దామని రెప్పలు మూత్తే ఏం లాబం ? నిద్రబట్టనిత్తేగా.' అంటూ ఇదవుతున్న అచ్చాల్ని 'ఇదుగో నిన్నే ఇనబట్టంలా ? చెవుల్లో చెట్లు పెంచావా ?' అని రబాయించింది దర్మపత్ని దాలమ్మ గుడిసిలోపల్నుంచి.

'ఏంటో ? మహాజోరు మీదున్నట్టుంది. తొక్కుతా నేంటనుకున్నావో ?' పౌరుసంగా అన్నాను.

'ఏంటే ?' రోసంగా దాలమ్మ రెట్టిచ్చగా –

'పంగ బద్దలుగొట్టి, తొక్కినారలాగుతానే తప్పదు ...'

'నువ్వా ? నువ్వే! ఇక – కాలు చేతులు జట్టు పోలుగాడిలాగ ఆడించి రిచ్చాదొక్కాల. వూరోళ్ళంతా తిర్నాలంటా మజ్జాన వ:నగా ముచ్చటగా ఎల్లినారు. మంచీ పెడ్డా, అచ్చటా ముచ్చటా, సంతోసం పవ బాగ్యం ఏవీ లేదుగాని తొక్కుతాడంట – రిక్స అని జాడించింది దాలమ్మ పళ్ళు పటపట్లాడిచ్చి.

'అయితే ఇంతకీ నువ్వనేదేంటే ? ఆఁ ?'

తననేదేంటో దాలమ్మ చెప్పబోయేలోగా 'వదినా! వదినా' అంటూ వచ్చింది పక్కగుడిసి పున్నమ్మ

'ఏంటే పున్నమ్మా ?'

'బోయినాలయినియ్యా ?'

'ఆఁ. అయ్యాయి గనకే నోటంట మాటొచ్చి యవారం మొదలెట్టాడు నీయన్న' అంటూ—జబ్బ మీద కరిచిన జాతి దోమని గట్టిగా గుద్దింది. ఆ దోమ నెత్తురుగక్కి పచ్చడయిపోగా 'మీ బోయినాలో ?' అనగా – 'మా బోయినాలా! ఏముడుగుతావొదినా?' అని పున్నమ్మ రాగాలు దీయగా, కళ్ళప్పగించవ్వాలూ, చెవులప్పగించి దాలమ్మా వుండిపోగా, రాగాలాపి –

'మా ఇంటో మూడురోజుల్నించి ఎద్దాగ యాగం. నుత్తకీ, మాయనకీ పడిచావటంలేదు.' అంది పున్నమ్మ.

'ఏ !?'

'ఏం చెప్పమంటా ? తాగొచ్చి నీయన్న – అదే – మాయాయిన ఒకటే గొడవ. నా వంటిని నలగని కండా, ఇరగని బొమికా లేదు. ఏ రోజూ నా ఈపు రాండోలు మోతేగదా. ఇజ్జాసి వూర్కోలేక ముసల్ది అడిగింది—'ఒరే రావన్నా! ఆడగూతుర్నట్టా కార్నం లేకుండా తన్నగూడదురా. అది కన్నీరెటితే ఇంటికి మంచిదికాదు' అని మంచిగా చెప్పింది. అమట్న ఇంతెత్తు వెగిరి – 'ముసలి ముండా నాకు దెలీదనుకున్నావా ? ఆ రోజుల్ల మా నాన్న నిన్ను గొట్టటం నాకు దెలీదా ? నాకు నీతులు చెవుతాది?' అంటూ తగులుకున్నాడు. 'ఈ వంశానికీ తాగుడు నయ్యంలాగ పట్టుకుందిరా. అది పట్టేగద నీ తాత, నీ నాన్న – ఇప్పుడు నువ్వు ఇట్టా అయ్యారు' అని జాడిచ్చిందా – అప్పుడు తిక్కరేగి క్రరుమ్ముకుని ముసలమ్మమీద కెగబడ్డాడా – అప్పటి నుంచీ ఎడ ముగం పెడముగమై సాదిమ్ముకుంటున్నారా – అది రేగిరేగి ఇవాళ పెద్దగా అయి – ఆయనటు రిక్స దొక్కటానికి పోగానే – ముసలామె ఇట్టా బయల్దేరింది ...'

'ఎట్టా ? ఎక్కడకీ ?!'

'చెప్తన్నా. చెప్తన్నా. ఇకాదు నాకు కొడుగ్గాదు. నేవాడికి తల్లినిగాను. పేగు బంధం తెంపుకున్నా. తిరణాలకి బోయి – అక్కడ్నుంచి నా కూతుర్దగ్గర కెల్తా. నా మురుగులు దానికే ఇత్తా అంటూ – ఆ అడంగిరేకల అంజయ్య తిర్నాల కెల్తావుంటే ఆడెమ్మట పోయింది. పోగా, ఈఏళ ఇంటికి తిరిగొచ్చి ఏదీ? ముసల్ది ఏదే అని ఆయన ఆర తియగా – వున్నదున్నట్టు చెప్పా. అప్పుడా కో మంతా నా మీద చూపించి, నా ఈపు ఇమాన మోతమోగిచ్చి – ఆ ముసల్దాన్ని చంపుతానని శపదం చేసి బాణాకర్ర తీసుకుని చీకట్లో పడిపోయాడ ఆదే ఇదిగా.'

'దెబ్బలు బాగా తగిల్నియా ?'

'దెబ్బలా ? నా బొందా? అయన్నీ నా కలవాటే గదా. మా యాడబిడ్డ మొగుడూ తగినోడుగాడు ఆడూ ఈడూ తాగిన మైకంలో ఆ మురుగు కోసం ఆ ముసల్దాన్ని చంపుతారో లేక ఒకళ్నొకళ్




చంపుకుంటారో అని గదా నా బాధ—నేనేం జేతును దేవుడో! ఇట్టావుంటే నా గురించడుగుతావేంటే?'

'అయితే ఇప్పుడు మమల్నేం జెయమంటావే పున్నమ్మా ?' అచ్చాలనగా —

'ఏం జెయ్యనని మెల్లిగా అంటావేమిరా అన్నయ్యా ! నలుగుర్నీ ఏసుకుని ఎళ్ళి సమాధానం జేసి ఆ ముసల్దాన్నీ, నీ బావమరిదినీ జాగర్తగా పట్టుకురా ఎట్టాగయినాసరే.' అంది పున్నమ్మ.

'ఇంకా పడిశెంలాగ ఈ జల్లు వదల్నేదు. ఈ వానలో ఈ చీకట్లో ఆ తాగుబోతుముండా కొడుకుల్దగ్గరకి ఏ ఇదిని ఎళ్లమంటావే ?' అని అచ్చాలు అనగా — 'ఆడకూతురు ఆ ఇదిని గోష పెడతావుంటే దోమయినా కుట్టనట్టు ఎలాగెలాగ వుంటావయ్యా ? పో. లాంతరు దీసుకుపో. కట్టా లెవరికిచ్చినా ఒకటే. ఇయ్యాంది. రేపు నేనూ' అని దాలమ్మ సపోర్టు ఇవ్వగా —

'ఏంటే ? నేనొక్కడ్నే పోవా ?' అని లబలబ మన్నాడచ్చాలు కోపంగా చేతులూపి.

'ఒకడివిగాపోతే నలుగుర్నేసుకుపో. వున్నారుగా పేకాట జతగాళ్ళు. రాగిదాట్ల రంగయ్యా, బూసి మొగుడు బసవయ్యా వగయిరాలూ, పోయిరా.' అని దాలమ్మ పట్టుబట్టింది. బొడ్లో ముడేసుకుని వున్న పేకముక్కల్ని తడుముకుంటూ — 'సరేనే. ఆడకూతుళ్ళు అంటన్నారు గనకా ఆ రత్తపాతాన్నాప టానికి నే నెళ్తా. తప్పకుండా వెళ్తా. కాని యమచలిగా వుందెట్టాగే వున్నమ్మా ? చిల్లర డబ్బులుంటే చూడు' అని అచ్చాలు అడగ్గా — 'అంతకంటేనా ? ఇదిగో' అంటూ కొంగున ముడేసిన ఐదు రూపాయల నోటుని అందించింది పొన్నమ్మ ఆడికి.

బుడ్డొడ్ని దాలమ్మకిచ్చి, లాంతరూ, కర్రా, తాటాగ్గొడుగూ దీసుకుని బయటపడ్డాడు అచ్చాలు. గుడిసెల్లో తొంగున్న రంగయ్యని, బసవయ్యని, ఈరయ్యని లేపి పిలిచి — 'రండిరా నాయాళ్ళలారా' అన్నాడు.

'ఏంటిరో అచ్చాలుగా ఏంటి కతా ?' అని వాళ్ళడగ్గా — 'పెద్ద కతేవుందిలే రండిరా, రండిమరి' అని ఆళ్ళని తోలుకునిపోయి — ఆ తాగుబోతు రాముడుగాడి వైనం తెలియజెప్పాడు. చెప్పి — 'ఈ తాగుమోతెదవల్తో ఇదే గొడవరా. వూరికే దూకుతారు. తలకాయలెగిరిపోతయ్యి, రక్తం వరదగా కారుతుంది. ఒక ఎదవపని చెయ్యటానికి అంత కష్టంగాదు. ఒక మంచిపని చెయ్యాలంటేనే మన్లాటి పెద్దమనుషులం చేతులు చేతులు కలిపి నిలబడాలి' అని గట్టిగా అన్నాడు.

'అయితే ఇపుడు నిద్ర మానుకుని మనమేం జెయ్యాల్రా ఎనవా ?' అన్న గర్జన రాగా—

'మనం తక్షణం ఆ ముసల్దాన్ని రక్షించాలి. లేపోతే ముసల్ది చచ్చిపోతుంది. ఆ ముసల్ది పోగా — మురుగులూ పోతాయి. నా కళ్ళతో చూశా. ఎండి మురుగులు. ఎండిమురుగుల్రా నాయాళ్ళల్లారా.'

'ఓరి దొంగగాడ్డి కొడక ! ఓరోరె అచ్చాలుగా !'

'మనందర్దీ ఆ జాతే గదర. అందువల్ల తిట్లు మరేం ఫర్లా' అని కులాసాగ నవ్వి, ఆ తిట్టినవాడి చెవిలో నోరుపెట్టి గుసగుసమన్నాడచ్చాలు. ఆడు పక్కవాడిదీ, ఆడింకోడిదీ చెవులు కొరగ్గా అందరి మొకాలూ ఇంతయ్యాయి. విచ్చుకున్నాయి బూరల్లాగ.

'పదండి పదండెహె ! పాపం ముసల్దేమయి పోద్దో. మనలాంటి పెద్దమనుసులు ఇటువంటి ఎవారాల్లో వూనుకోనాలి. కాదంటే మర్యేదకాదు.' అంటూ కిచకిచలాడ్తూ కోతుల్లాగ అచ్చాల్ననుస రించగా — ధైర్యంగా సాగిపోయి వూరుబయటి కొచ్చారు.

చిమ్మచీకటిగా వుంది. కన్ను పొడుసుకున్నా కనపట్టంలేదు. గుడ్డిలాంతరు ఎలుగులో బురదని లపలపమని తొక్కుకుంటా దోమల్ని, ఈగల్ని, ఈలపురుగుల్ని దాటుకుంటా ఆళ్ళు సాగిపోయే ఆ క్షణంలోనే — వాళ్ళకి చెరువుగట్టునున్న కల్లుపాక కనపడింది — సల్లగా, రంజుగా. సరిగ్గా అప్పుడు పొరుగూర్లో — చేపలపులుసుతో చెల్లెలు పెట్టిన అన్నం వూటుగా దిని బ్రేవుమని తేన్చాడు రామన్న. త్రేన్చి సకిలిచ్చి చుట్ట ముట్టించాడు. అప్పటినాకా అదేపనిగా నీతులు నూరిపోస్తావుంది తోడబుట్టిన ఆడబడుచు. ముసల్ది ముక్కు చీదుకుంటా వుంది. అల్లుడంతా వింటావున్నాడు.

'తప్పేనే. తప్పేనన్నాగా.' అన్నాడు రామన్న సిగ్గుతో చితికిపోతా.

'అట్టా అంటేగాదు. అమ్మన్నాడు. అమ్మంటే ఎవరు ? దేవత. ఆ దేవతని బాధపెట్టి పదిన్ని అట్టా ఇంసబెట్టి — నువు ఏం సాదించేటట్టురా ? అసలు మా ఆడగూతుళ్ళకి ఈ శిక్ష ఎందుకురా ? ఎందుకంట ? చెప్పరా అన్నయ్యా. చెప్పు.'

రామన్న తల వేలాడేసాడు.

త్వరలో

## రాగబంధితులు

### సీరియల్ నవల

ప్రారంభం !

## కార్టూనిస్టులకు సూచనలు !

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితం మీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి. * ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి !

★ వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగా వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివి నప్పుడే అర్థం అవ్వాలి ! కార్టూన్‌మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామా గల తపాలా బిళ్ళలు అంటించిన కవరు గల కార్టూన్‌లను త్రిప్పి పంపడం జరుగుతుంది — దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీ గాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది — పరిశీలనకి ఐదారు వారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం —

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

— సం॥

## దోమలు

'ఇన్నాళ్ళూ నీ బావ అట్టా అయాడని ఇదయిపోయాను. ఇప్పుడునువ్వూ మొదలుపెట్టావన్న మాట. ఆయన మారిపోయి మంచాడయాడని మురిసానా ? నీ సంగతి ఇలాగయిందని తెల్సింది — ఇంక ఎందుకురా తమ్ముడూ మేమెందుకు ? మా బతుకులెందుకు ? ఛీ.'

'చెల్లిలా ! నాది తప్పేనే. చంపలు వేసుకుంటా. ఇకనుంచి అమ్మని పువ్వుల్లో పెట్టి సూసుకుంటా. అమ్మదేవ్నుగ్రీవాగ్నని,వదిన్ని ప్రేమగా సూసుకుంటా. చెయ్యెత్తితే ఒట్టు. నేను మంచివాడ్నని నీచేతే అనిపిస్తా. తాగుడు గీగుడు సూనేత్తా. నిజం. ఒట్టు' అని మొత్తుకుని చెల్లెలికి మాటిచ్చి — పొలిమేరదాకా బావ వచ్చి సాగనంపగా—వస్తానన్జెప్పి—ముసల్దాన్ని ప్రేమగా చేత్తో పట్టుకుని మెల్లిగా నడిపించుకుంటూ ముందుకి సాగాడు రామన్న.

వర్షం మళ్ళీ మొదలయింది. దారినిండా రాళ్ళూ ముళ్ళూ. ముసల్దాన్ని బుజంమీద వేసుకుని బురదలో భారంగా అడుగులు వేసాడు. చమటలు కారి వీపు తడిసింది.

'ఈ బురదలో నీచేత మోయించుకుంటన్నాన్రా కొడుకా ?' ముసలమ్మ లబలబలాడింది. రామన్నకి నవ్వు వచ్చింది. అంతా చేతులారా చేసుకున్నదేగద. కార్యం పార్యం లేకుండానే తను పొన్నమ్మని చెయి చేసుకోటం, అది లబలబలాడటం, అదేంపనని ముసల్ది అడ్డం పడటం, తను రంకెలు వేయటం, గొడవలూ! కావాలని కొనితెచ్చుకున్నదే గదా ఈ సంత !

రామన్న రొప్పాడు. అసలే బుఃవ. ఆపయిన ముసల్దాని బరువు. చీకటి. వాన. ఆయాసం. ఆపయిన కాళ్ళనిండా ముళ్ళు. రాళ్ళు చేసిన పుళ్ళు. మా బాగ అయింది గద !

చివరికి ఊరు దగ్గరపడింది. చెరువు కట్ట ఎక్కాడు రామన్న. అది దిగితే ఎంతా! నాలుగంగలు.

లసలస అడుగులు పడ్డాయి. అంత దూరాన గుడ్డిలాంతరు. ఎవరివో మాటలు. కాసేపటికి ఆ మాటలు దగ్గర పడ్డాయి. వాళ్ళు తూలుతూ పేల్తున్నారు.

'ఎవ్వ్రా అది ?'

'ఆగరా.'

రామన్న ఆగాడు.

'ఎవరంటే మాటాడవేరా పందిలాగా ? అ !'

'నేను', రామన్నని.'

'నువ్వేనా. తాగుబోతు రామన్నగాడివేనా ? ఏమిరా, ఏం చేశావ్రా ? ఏదీ ముసల్ది ? ముసల్దాని చేతి ఎండి మురుగులెయ్యిరా?' గప్పున వాసనొచ్చింది. నలుగురూ పూటుగా తాగివున్నారు. తూల్తున్నారు. బురదని కసపిస తొక్కుతున్నారు.

'రామిగా! ఒరేయ్. వుచ్చి పగుల్తుందిరా. తీయ్ ఆ మురుగుల్తీసిటెయ్యి.' ఆ నలుగురూ మీదికి ఎగబడ్డారు. రామన్న అటు ఇటు చూసాడు. చేతులోవున్న కర్రని తిప్పాడు — గిరిగిరా.

'ఫట్' మంది. లాంతరు పగిలి దీపం ఆరి పోయింది. చటుక్కున వెనక్కి తిరిగి చెట్టుచాటుకి పరుగెత్తాడు. ముసలమ్మ వీపుమీదే వేలాడుతూ వుంది. కాటుకంటి కటికి చీకట్లో కర్రలు లేచాయి. పటపట. ధనధన. బూతులు, రాగాలు, కసపిస గోల.

'అయ్యో.'

'అమ్మో.'

'చచ్చారో.'

'అబ్బా. నా బుర్ర బద్దలయిందిరో అచ్చాయిగో. చంపేవురా నన్ను.'

గుడిసెవద్ద ముసలమ్మని దింపి కాళ్ళు, చేతులు కడుక్కుంటున్నాడు రామన్న. పొన్నమ్మా, ఆ వెనకే దాలమ్మా పరుగెత్తుకుని వచ్చారు. దోమలు జయ్యని లేచాయి. చేతులమీద వాలి పీకాయి. ఛట్టుట్మని చరిచి వాట్నిచంపాడు రామన్న. తాగుడు లాంటి అలవాట్లు ఇట్టాగె ప్రాణాన్ని కొరికి రక్తాన్ని పీలుస్తాయ్. రొదపెట్టి మనసు మనసులో లేకుండా చేస్తయ్యి. మనుషుల్తో — బుద్ధి జ్ఞానం వున్న మనుషుల్తో కూడా — ఆడుకుంటాయ్. మనిషికి వెర్రెత్తిస్తాయ్. ఆడ్ని రాక్షసుడ్ని చేస్తాయ్. హత్యలు చేయిస్తాయ్. మంచీ చెడూ వుండ దసలుండదు. నిజం !

'వచ్చావా తమ్ముడూ' — పలకరించింది దాలమ్మ. రామన్న నవ్వాడు.

'అబ్బాయా ! నీ కోసమని మీ మామావాళ్ళు వచ్చారే. కనపళ్ళా ?' అనడిగింది దాలమ్మ.

'నిన్నేరా రాముడూ! మాట్టాడవేంటి ? అళ్ళు కనపడలేదా ?' — కంగారు.

'కనపడ్డారులే' అన్నాడు రామన్న.

'మరేరీ ? అళ్ళు ఎక్కడయ్యా ?'

'బాగా తాగి చెరువుగట్టుమీద బుర్రలు బద్దలుగొట్టుకుని పడివున్నారులే.'

'ఓరి దేవుడో! నేనేంజెయ్యనురో !' దాలమ్మ రాగాలు తీసింది.

'ఇంకా అట్టాగే నుంచున్నావే ? పద పద!' అని తగులుకుంది పొన్నమ్మ.

'ఎక్కడికి పదా ?' రామన్న అనగా —

'అక్కడికే. అళ్ళట్టా కొట్టుకుపడివుంటే వూరుకుంటావా ? తీసుకొచ్చి ఆస్పటల్లో జేర్పు—'

'ఈ తాగుడు న కొంప ముంచిందిరో దేవుడో. తమ్ముడూ నువ్వే నన్ను కాపాడాలి. పద నాయనా! ఆ మనిషిని తీసుకొచ్చుకుందాం. రా బాబూ' బతిమాలింది దాలమ్మ. పద పదమని పోరింది పొన్నమ్మ. అసల్సంగతాళ్ళకేందెల్సు ?

అయ్యిందేదో అయ్యింది. సరెనని కర్ర తీసుకుని బయలుదేరాడు రామన్న. అతనివెనకే దాలమ్మ, ఆ వెనకే పొన్నమ్మ — 'ఓ ఎంకయ్యన్నయ్యో! రావయ్య తమ్ముడో, లేండి లేండి. రాండి' అని అరుస్తూ. బురదగుంటల్లోంచి దోమలు జయ్యన లేచి వాల్తున్నాయి. వాలి పీకుతున్నాయి. అది వాటి అలవాటు. చెడు అలవాట్లు అంతే! మనిషిని పీకి పాకాన పెడతాయి. మానవత్వాన్ని పీల్చి నరరూప రాక్షసుడ్ని చేస్తాయి. వీట్ని చంపాలి. అందుకు ఎంతో కష్ట పడాలి.


తమ పిల్లల పౌష్టిక ఆహారం
గురించి తల్లులు బాధపడుతుంటారు.
అయితే సుచిత్రకు ఆ చింత లేదు...
"ఎందుకంటే, నేను మాపిల్లలకు రోజూ హార్లిక్స్
ఇస్తాను. హార్లిక్స్ ఇమ్మని డాక్టరు చెప్పినప్పటినుంచి,
ప్రతి రోజూ హార్లిక్స్ త్రాగటం మా పిల్లలకు
అలవాటు చేసాను. హార్లిక్స్ రోజంతా వారిని
ఆరోగ్యంగా, చలాకీగా ఉంచుతుందని
నాకు తెలుసు.
మీ పిల్లలకు మీరు కూడా
హార్లిక్స్ ఇస్తారు. అవును కదూ?"


హార్లిక్స్
మంచి పుష్టికరమైనది.


Horlicks
THE IDEAL FOOD DRINK


"హార్లిక్స్ ప్రధాన పుష్టిదాయక పానీయం.
పుష్టిదాయకమైన ఆహార పదార్థాలతో అద్భుతంగా
దాన్ని రూపొందించారు. హార్లిక్స్ ఏళ్ళ తరబడి
నిరంతరంగా సత్ఫలితాలను చూపిస్తోంది. మా కుటుంబ
సభ్యుల ఆరోగ్యం కాపాడేందుకూ, వారు
ఏరోజుకారోజు చురుగ్గా ఉండేందుకూ నేను హార్లిక్స్‌ను
సిఫార్సు చేస్తున్నాను."
Hx-6082 Tel

(గత సంచిక తరువాయి)
















[ఇంకా ఉంది]

"నేను ఓ ఇంజనీర్ని
నా బట్టలలో కొత్తదనాలు స్ఫురిస్తూంటే నాకేం కావాలిక."



మీకు నచ్చే దుస్తులు
మీరు మెచ్చే బట్టలు




సూటింగులు, షర్టింగులు, చీరలు, డ్రెస్ మెటీరియల్స్, మరియు డెనిమ్.

**మఫత్‌లాల్ ఇండస్ట్రీస్** న్యూ షొరాక్ మిల్స్ **మఫత్‌లాల్ ఫైన్**

MF-31 TEL

ఆధునిక శాస్త్ర ప్రగతి

# లేజర్ కిరణాల వింతలు!

అనంత దూరాలనుండి మనకు చేరే బలహీనమైన రేడియో సంకేతాలని చక్కగా వృద్ధికరణం చెందించగల విధానము, ఏ గడియారము కొలవలేనట్టి కాలాన్ని సున్నితంగా కొలవగల విధానము, ఉక్కు పలకలకు కాంతికిరణాలతో రంధ్రాలు ఏర్పరచగల విధానములాంటి ఎన్నో విప్లవాత్మక ప్రక్రియలు లేజర్ కిరణాల వలన సాధ్యమవుతున్నాయి.

పరమాణువులు, అణువులు జడత్వపు కణాలు కాదు. ఇవి శక్తినికల్గి ఉంటాయి. పరమాణువులో న్యూక్లియస్ ఉంటుంది. దానిచుట్టూ నియమిత కక్ష్యలలో ఎలక్ట్రానులు పరిభ్రమిస్తూ ఉంటాయి. అవి ఆత్మ ప్రదక్షిణాలు కూడా చేస్తూ ఉంటాయి. అట్లే ఒక ఘనస్ఫటికాన్ని తీసుకుంటే ఆ స్ఫటిక లాటీస్ చట్రాల్లో పదార్థపు అణువులు లేదా పరమాణువులు కంపిస్తూ ఉంటాయి. ద్రవ్యాణువులు, వాయు అణువులు అటూ యిటూ తిరుగుతూంటాయి. ఇవన్నీ కూడా వేరు వేరు శక్తులను ప్రదర్శిస్తూ ఉంటాయి. అంటే ఉష్ణశక్తి, కాంతిశక్తి, అయస్కాంతశక్తి, విద్యుచ్ఛక్తిలాంటి శక్తులు అన్నమాట!

నియమిత అంచెలలో అణువులు, పరమాణువులు వేరు వేరు శక్తిస్థాయిలలో ఉండగలవు. ఉదాహరణకు పైనుండి పదార్థము మీదకు వికిరణం పతనం చెందినదనుకొనుము. పదార్థమందలి ఒక పరమాణువు తక్కువ శక్తిస్థాయిలో ఉన్న ఆ పరమాణువు పతన వికిరణమందలి శక్తిని శోషణం చెందించుకుంటుంది. పతన వికిరణం పదార్థమును దాటి బహిర్గతమయ్యేసరికి అందలి శక్తి పరమాణువు శోషణం పొందిన శక్తిమేరకు తరిగిపోయి ఉంటుంది. అట్లుగాక పదార్థమందలి పరమాణువు హెచ్చుశక్తి స్థాయిలో ఉండి దానిమీద తగినంత పౌనఃపున్యంగల వికిరణం పతనం చెందిన పరమాణువు తక్కువ శక్తిస్థాయిలోకి పడిపోతూ అధికంగా ఉన్న శక్తిని బహిర్గత వికిరణంతోబాటు విడుదల అయిపోతుంది. అంటే పరమాణువు శక్తిని ఉద్గారం చేసిందన్న మాట!

సామాన్యంగా శక్తిని శోషణం చెందించుకోవడం ఉద్గారం చేయడం ఒక క్రమపద్ధతిలో జరుగక ఇష్టము వచ్చినట్లు పరిస్థితుల ననుసరించి జరుగుతోంది. దీనికి కారణం పతన వికిరణం అనేక పౌనఃపున్యాల మిశ్రమం కావడం. అంతేకాకుండా కంపనాలు చెందు అణువులు, పరమాణువులు ఒకదానితో మరియొకటి చర్యనొంది శక్తి రూపాంతరతలో సంక్లిష్టత ఏర్పడుతోంది. ఈ పరమాణువులు లేదా అణువులు శక్తిని ఒక క్రమమైన పద్ధతిలో శోషణం చెందించుకోవడం లేదా ఉద్గారం చెందించడం జరిగితే వెలువడే వికిరణమే "లేజర్" వికిరణం!

లేజర్ వికిరణాన్ని ఏర్పరిచే పరికరంలో పరమాణువులు శక్తి స్థాయి పతన వికిరణంతో బాగుగా పెంచుతారు. అంటే పరమాణువులు శక్తి స్థాయి బాగుగా పెరిగిన తరువాత అవి శక్తిని వికిరణం చెందిస్తాయి. లేజర్ పదార్థమందలి పరమాణువుల శక్తిని కాంతి శక్తి లేదా విద్యుచ్ఛక్తి వినియోగించి పెంచుతారు. ఉత్తేజితం కాబడి ఎక్కువ శక్తి స్థాయిలో ఉన్న ఈ పరమాణువులు తక్కువ శక్తి స్థాయిలోకి పడిపోవడం ప్రారంభమవుతుంది. ఈ ప్రక్రియలో అవి లేజర్ పదార్థ స్వాభావిక వికిరణాన్ని వెలువరుస్తాయి. ఈ వికిరణం బలహీనంగ ఉండుటవలన లేజర్ పరికరంలో పాక్షిక పరావర్తనులను ఉపయోగించి పరికరమందే వెలువడు లేజర్ కిరణాల తీవ్రతను వృద్ధి అయ్యేటట్లు చేస్తారు. తగిన తీవ్రత చెందిన పిదప లేజర్ వికిరణం ఒక ప్రత్యేకమైన ద్వారంగుండా వెలుపలకు వస్తుంది.

లేజర్ కాంతి కిరణంలో చాలా అతిదగ్గరగా ఉండే పౌనఃపున్యాల సముదాయం మాత్రమే ఉంటుంది. సామాన్య కాంతి దూరం పోయేకొలది విశాలంగా పరచుకున్నట్లు లేజర్ కాంతి విశాలం అవ్వదు. లేజర్ కాంతి యందలి తరంగాలు సంబద్ధకంగా ఉండడం దీనికి కారణం.

మొట్టమొదటి లేజర్ వికిరణాన్ని 1960 లో రూబీ (కెంపు) లేజర్‌నుపయోగించి టి. హెచ్. మేయ్‌మాన్ సృష్టించాడు. తరువాత బెల్ టెలిఫోను ప్రయోగశాలలో నిర్విరామంగా లేజర్ కిరణాల ఉత్పత్తి చేసే పరికరాన్ని రూపొందించారు.

ఈ లేజర్ వికిరణం పరిశోధకులకు పరిశోధనా పరికరంగా ఎంతో ఉపయోగపడుతోంది. ఈ వికిరణాల సహాయంతో రసాయనిక చర్యలు అణుస్థాయిలో జరిపించుట లేక ఆపుజేయుట సాధ్యపడుతోంది. ఈ లేజర్ వికిరణాల సహాయంతో భూకంపాలు ఏర్పడడాన్ని ముందుగా పసిగట్టడానికి వీలవుతోంది. ఈ లేజర్ కిరణాలు లోహాలను కోయడానికి అనేక యంత్రపరికరాల యందలి సున్నితమైన భాగాల తయారీకి వినియోగపడుతున్నాయి. శరీరమందలి అతి సున్నితమైన భాగాలకు శస్త్రచికిత్సను వైద్యులు లేజర్ కిరణాల సహాయంతో చేస్తున్నారు. కత్తి అవసరంలేని శస్త్రచికిత్స అని దీనిని అంటారు. ఈ రకమయిన శస్త్రచికిత్సవలన సెప్టిక్ అయ్యే ప్రమాదం అసలు ఉండదు.

వార్తాప్రసారాలకు లేజర్ కాంతి కిరణాలు ఎంతగానో వినియోగపడుతున్నాయి. చాలా హెచ్చు పౌనఃపున్యాలు అతి తక్కువ భేదము గల్గినవి ఈ వికిరణంలో ఉండడం వల్ల అనేక వేల వార్తలను ఒక్కసారిగా ప్రసారం చెయ్యడానికి వీలవుతోంది. లేజర్ వికిరణాలను టెలివిజన్ ప్రసారంలో ఉపయోగిస్తున్నారు. బహుశా రోదసిలో జరిగే విషయ విశ్లేషణలకు లేజర్ కిరణాలు ఎంతగానో ఉపయోగపడవచ్చు. లేజర్ కిరణాల సహాయంతో ఎలక్ట్రానిక్ కంప్యూటర్లు అతి సున్నితంగా పనిచేసేటట్లు చేయవచ్చు. స్పెర్రీ రాండ్ కార్పొరేషన్ నిర్మించిన రింగు లేజర్ రోదసినౌకల గమనాన్ని కొలచుటయేగాక వాటి గమనాన్ని సవరించడానికి కూడా ఉపయోగపడింది.

లేజర్ కిరణాన్ని మిలటరీ విభాగంలో శత్రువులకు చావు కిరణంగా కూడా ఉపయోగించవచ్చు. అయితే శాంతియుత ప్రయోజనాల గురించి దీనిని వినియోగించడం ముఖ్యం. అందుచే వైజ్ఞానికంగా పైకి ఎదిగిపోతూన్న దేశాలు ఈ లేజర్ కాంతి వికిరణ సహాయంతో సామాన్య ప్రజలకు అనునిత్యం అవసరమయ్యే విద్యుచ్ఛక్తి ఉత్పాదకంగా ఉపయోగించడానికి ప్రయత్నాలు చేస్తున్నాయి.

— పి. వి. సర్వేశ్వరశర్మ



# ప్రకృతి కానుక ప్రతి ఒక్కరి
# కోమల,యవ్వన ఛాయ
# సర్వాంగాలకి

పోర్చుగీస్‌లో వేప పేరు మార్గోసా. వివిధ రూపాల్లో వేప దేహానికి, చర్మానికి చేసే విశేషమైన మేలుకు తిరుగులేదు. అందుకనే తరతరాలుగా వేప అన్న అంత ఆదరణ.

మార్గో సబ్బు ఒక్కటిలోనే అధిక భాగం వేపనూనె వుంది. శుద్ధమైన, సహజసిద్ధమైన మార్గో సబ్బు శరీరాన్ని పరిశుభ్రంగా వుంచి అంగాలన్నిటి చర్మాన్ని సంరక్షిస్తుంది.

ప్రకృతికి తరలండి. మార్గోతో స్నానం చెయ్యండి. మీరు ప్రతిసారి స్నానం చేసేక మీ శరీరమంతా పరిశుభ్రంగా, తాజాగా, మెరుస్తూ వుంటుంది.

**శరీరమంతా పరిశుభ్రం**
**తల్లిలా చేసే సంరక్షణ**



# సినిమా

—జి. వి. జి.

## ఊరుకి మొనగాడులో ఊరికొనే ఊళ్ళపేర్లు ఊతపదాల్లా ఊదే వ్యక్తి!

''ఈ పిక్చర్‌లో నే చెప్పే ప్రతి డైలాగ్‌కూ ప్రతి ఊళ్ళో క్లాప్స్ తప్పవు. నా మాటమీద మీకు నమ్మకముందా ? లేదనండి...శాంపిల్ చూపిస్తాను'' అంటూ ముందుకు నడిచారు అల్లు రామలింగయ్య-కోటిలింగం వేషంలో.

సర్వే ప్రాంతం... గుడ్ను మిటకరిస్తున్న తమ పని అడ్డతీగల అయిపోగల్దు,'' అన్నాడు.

కోటిలింగం రెచ్చిపోయాడు. ''ఏమిటోయ్, నేనేలాఅంటే-అదాఅంటున్నావ్? ఇలామాటలుమండపేట దాటితే, నీ సంగతి సత్తెనపల్లి అవగలదు.''

''ఇంకాపేపు నువ్విక్కడుంటే, నీ సంగతి గద్దనాపల్లి మీదుగా గన్నవరం దాటి, పిఠాపురం పక్కగా – పెద్దాపురం దగ్గరగా రైలుగేటు దాటి, ఫిరంగిపురంగుండా పాట్నా చేరి, పేలిపోగల్దు జాగ్రత్త!'' అని కృష్ణ అనేసరికి ఉక్రోషంగా పాపారావు (రావు గోపాలరావు)తో చెప్తూ, 'చూడబోతే – వీడు మన బతుకులు బల్లారి చేసేలా ఉన్నాడు,' అంటాను. మరోసారి 'అనవసరంగా మీరు తెంబేలుపడి, బెజవాడ అయిపోకండి... మన ఇద్దరి పని కూడా దివ్యంగా ధర్మవరంలా ఉంటుంది,' అంటాను... ప్రస్తుతానికి ఇవి చాలులెండి... ప్రతి ఊళ్ళోనూ కాకినాడలాగా క్లాప్సే కదా ?'' అన్నారు అల్లు రామలింగయ్య.

''తాడేపల్లిలాగా తప్పదు,'' అన్నారు విశ్వనాథ



'ప్రేమ నాటకం'లో రాజ్యలక్ష్మి, మురళీమోహన్, ఋశ్యమల

కోటిలింగంను చూసి కృష్ణ (కృష్ణ) ''నేను వచ్చింది గోడవున్స్‌కి అన్నివిధాలా అనుకూలమైన స్థలాన్ని సెలెక్ట్ చేయడానికి. అంతేగాని, అడ్డమైన వాళ్ళు అడిగే స్థలాన్ని గవర్నమెంట్‌కి అంటగట్టడానికి కాదు,'' అన్నాడు.

''మా పాపారావుగారి మాట కాదంటే, తమ పని తాళ్ళరేవయిపోగల్దు,'' అన్నాడు కోటిలింగం.

కృష్ణ వెటకారంగా ''ఇక అట్టే మాట్లాడితే, బయలుదేరాడు కోటిలింగం.

షాట్ అయ్యాక ''ఎలా ఉంది ?'' అడిగారు అల్లు రామలింగయ్య.

''బరంపురంలా బ్రహ్మాండంగా ఉంది,'' అన్నారు డైరెక్టర్ కె. రాఘవేంద్రరావు.

''అయ్యా, ఇదీ విషయం... ఇలా మన రాష్ట్రంలోని కొన్ని ఊళ్ళ పేర్లను ఈ పిక్చర్‌లో నేను ఊతపదంలా ఏకరువు పెట్టేస్తాను. మచ్చుకి— మరికొన్ని వింటారా ? హీరో గురించి నేను ఎ. గోపాలకృష్ణ నవ్వుతూ.

గోపీ మూవీస్ ''ఊరుకి మొనగాడు'' చిత్రంలో తెరముందు -- కృష్ణ, జయప్రద, చంద్రమోహన్, రాజ్యలక్ష్మి, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య, కాంతారావు, గీత, ప్రసాద్‌బాబు, మూర్తి – తెరవెనుక – సత్యానంద్, చక్రవర్తి, కె. ఎస్. ప్రకాష్, శ్రీనివాసరాజు, కోటగిరి వెంకటేశ్వరరావు, జాన్సి, చలపాటి శరత్, శేఖర్ కృషి చేశారు.

[38 వ పేజీ చూడండి]

# సులభంగా జీర్ణమయ్యే బియ్యపు సీరియల్
# మీ పాప ఆహారానికి తెస్తుంది కొత్తదనం



మీ పాపకి 4 నెలలు వస్తే, అతని ఆహారంలో ఘన పదార్థాలు ప్రవేశ పెట్టండి. అతనికి మొట్టమొదటగా ఉపయోగించతగిన ఘన పదార్థం నెస్టమ్ బేబీ సీరియల్. రైస్.

**జీర్ణం చేసుకోవడం సులభం**

బియ్యం నుంచి తయారయిన సీరియల్ జీర్ణం చేసుకోడానికి సులభమయినది.

**పలురకాలు**

పాలతో నెస్టమ్‌ని యివ్వడం ప్రారంభించండి. పాప పెరుగుతూ వుంటే, ఆహారంలో నెస్టమ్‌ని ఉడకబెట్టిన పండ్లు, పండిన మరియు మెత్తగా చేసిన కాయగూరలు, పప్పులతో పలురకాలుగా ప్రవేశ పెట్టండి.

# నెస్టమ్®
## బేబీ సీరియల్ రైస్

తయారుచేయడం సులభం!



ముందుగ మరిగిన వెచ్చని పాలు పోయండి.



నెస్టమ్ చేర్చండి కలపండి.



తినిపించుటకు తయారు









SAA/FSL/N/1554/TEL

# నాన్నవేపు చూసింది చంప!

నాన్న చిత్రమయిన మనిషి! కోలముఖం, అందమయిన కళ్ళు, ఒత్తయిన జుత్తు అందులో విరివిగా పండువెంట్రుకలు. ప్రతి అరగంటకి సిగరెట్టు తీసి ముట్టిస్తారు నాన్న. రోజుకి కనీసం ఐదు సిగరెట్టుపెట్టెలు ఊదొత్తులలా వెలిగిపోతాయి!

"చంపా! రంగిడ్నడిగి సిగరెట్టుపెట్టే, అగ్గిపెట్టే పట్టుకరా!" నాన్న ఆదేశం! తనని చూడగానే కిళ్ళీకొట్టు రంగడు, తను అడక్కుండానే, "సెంపా! ఇందా సిగరెట్టుపెట్టె... అగ్గిపెట్టె! మీ అయ్యకి సెప్పు! బాకీ పది రూపాయిలయి పోనాది!" అంటూ సణుగుతూ ఇస్తాడు సిగరెట్టు పెట్టె, అగ్గిపెట్టె.

"నాన్నా! బాకీ పది రూపాయలని చెప్పమన్నాడు!" అంటూ గేటుదగ్గర్నుంచే కేక వేసుకుంటూ వచ్చి చంప అందిస్తుంది సిగరెట్టు పెట్టెనీ, అగ్గిపెట్టెనీ.

నాన్న ఏమీ అనరు. సిగరెట్టు ముట్టిస్తారు. అప్పుడు సరైన మూడ్‌లోకి వచ్చి, "ఇద్దాంలే! వాడెక్కడికి పోతాడు, నే నెక్కడికి పోతాను?" అంటారు పొగమధ్యనించి.

"నాన్నా! ప్రయివేటు మాష్టారు జీతం అడగమన్నారు!" చంపకి గుర్తొస్తుంది, కిళ్ళీకొట్టు వాడికి గుర్తొచ్చినట్టు నాన్న బాకీ!

"ఇద్దాంలే! వందరూపాయిల నోటుకి చిల్లర లేదని చెప్పు!" అంటారు చిరునవ్వుతో నాన్న!

నాన్న చెప్పింది అబద్ధమని తెలుసు చంపకి. కాని, "నువ్వు అబద్ధం ఆడుతున్నావ్ నాన్నా!" అని అనలేదు! నాన్న ఎప్పుడూ అటువంటి కబుర్లే. డబ్బు బాకీ లేని దెవరికి? పాలవాడికి బాకీ! ధోబీకి బాకీ! కూరలమ్మికి బాకీ!

"ఏం బాబూ! మా బాకీ మాటేం జేసేరు?" అని వాళ్ళు అడగడం... నాన్న ఏదో సాకు చెప్పడం పరిపాటి. అలా అని వాళ్ళు అరువు ఇవ్వడమూ మానరు! నాన్న బాకీ పెట్టడమూ మానరు!

ఎందుకిన్ని బాకీలు నాన్న పెడతాడో చంపకి అర్థంకాదు.

అమ్మకీ, పాలవాడికీ వాదోపవాదాలు చెలరేగుతాయి. "ఏం దీనబంధూ? మరీ నీళ్ళపాలు పోస్తున్నావ్? నెలా అయ్యేసరికి గవ్వలిళ్ళల్లా రూపాయిలు పట్టుకపోతావు!" అని అమ్మ అంటే, పాలవాడు... "అమ్మా! సేరు రూపాయిన్నరకి కావాలంటావు! నీరు కలపకపోతే ఎట్టా అవుద్దమ్మా?" అంటాడు!

"ఏటమ్మా? మరి నా బాకీ మాటేం జేసినారు?" అంటూ అడుగుతాడు.

"నీళ్ళపాలెందుకు పోసేవ్ అంటే, బాకీ అంటూ బాకా తీస్తావ్! ఫస్టుకొచ్చి నీ బాకీ డబ్బులు పట్టుకపో!"

"ఎన్నో ఫస్టులు ఒచ్చినాయి, వెళ్ళినాయి! ఈపారి అంత బాకీ తీర్చియ్యాలమ్మోయ్!" అంటాడు వాడు. పాలవాడొస్తున్నాడనేసరికి చంప చెవులు మూసుకొనేది, లేదా పక్కింటికి పారిపోయేది.

ఈ గొడవ తనకు పట్టనట్టు నాన్న వీధి అరుగుమీద ఏనాటిదో ఆ ఇనప కుర్చీవేసుకుని, చంప తీసుకువచ్చిన సిగరెట్ పెట్టెలోంచో సిగరెట్ తీసి, దాన్ని పరధ్యానంగా నోట్లో పెట్టి వెలిగించి, జోరుగా పొగపీల్చి వదిలేవారు. లుంగీ, భుజంమీద తువ్వాలు. గుండెలమీది వెంట్రుకలు అక్కడక్కడా పండి పోయాయి — అదీ అతని రూపం!



అప్పటికప్పుడే నాన్న అరుగుమీంచి ఇంట్లోకి, "ఏమే! కాఫీ ఏమయింది?" అంటూ కేక వెయ్యడం, అమ్మ — "పాలవాడు రానీండి!" అంటూ వంటింట్లోంచే జవాబివ్వడం జరిగి పోయింది. పాలవాడు వచ్చి వెళ్ళేక, ఫిల్టర్ డికాషన్ కాఫీ అమ్మ ఇస్తే, నాన్న ఆ కాఫీని ఆప్యాయంగా చప్పరిస్తూ, మరో సిగరెట్ ముట్టించేవారు.

కాఫీ ఇస్తూ అమ్మ, "కాఫీ గుండ అయి పోయింది. సాయంత్రం వచ్చేటప్పుడు తెండి!" అని ఎప్పుడయినా అనగానే ఫ్రరున లేచేవాడు.

"ఏమిటీ? కాఫీ గుండ అప్పుడే అయి పోయిందా? శేరు గుండ ఫస్టుకి తెచ్చాను? ఇవా లింకా ఇరవయ్యో తారీఖు!"

"మీకు ఉదయం మూడుసార్లు కాఫీ కావాలాయె! మీ ముద్దుల కూతురు చంపకి మీ పోలికలే వచ్చాయి! నేను ఒక్కసారే తాగుతాను. అదీ మానీమంటే మానేస్తాను. కాని పొద్దున్నే ఒక గుక్కెడు కాఫీ పడకపోతే తలనొప్పి పట్టుకుంటుంది. మీకు ఆఫీసువేళకి తొమ్మిదికల్లా వంటచేసి పెట్టాలా?" అంటూ తన పని చేసుకుంటూనే ఏకరవు పెట్టేస్తుంది అమ్మ.

"ఈ కాఫీ మానేస్తే సరి! బోలెడంత మిగులు! కాఫీ గుండ, పంచదార, పాలు ఇవన్నీ!"

"మానీండి ... ఎవరు కాదన్నారు? బాకీలన్నా తగ్గుతాయి ... ఆ చేత్తోనే సిగరెట్లు మానేస్తే నెలకు ముప్ఫయి రూపాయలు మిగుల్తాయి!"

"మాట్లాడితే అదొకటి నీకు చేతనౌను ...




సిగరెట్లు మాని, కిళ్ళీలు మాని అని. బతకడమే మానేస్తేసరి!'' అని నాన్న అనగానే అమ్మ —

''నాదీ ఒక బతుకేనా? ఓ ఒచ్చటా, ముచ్చటా? ఓ మంచిచీరకి కాని, నగలకి కాని ఏనాడన్నా నోచుకున్నానా? ఎప్పుడూ లేదు, లేదు. లేదనే పాట! రోజులూ, నెలలూ వెళ్ళిపోతున్నాయి, ఎంత డబ్బు తెచ్చుకున్నా, ఎక్కడున్నావు గొంగళీ అంటే వేసిన చోటే ఉన్నాను అన్నట్టయిపోతోంది బతుకు!'' అంటూ ఆపకుండా నస! అరిగిపోయిన గ్రాంఫోన్‌రికార్డులా అదే పాట!

''అమ్మా! ఊరుకోవే!'' అని అరవాలనిపిస్తుంది చంపకి. కాని ఆ మాటంటేగానే అమ్మ ఎక్కువ చేస్తుంది సణుగుడు.

''చద్దికుండ పెట్టుకుని అందరూ పొద్దున్నే 'చద్ది అన్నం' తింటే, డబ్బు ఖర్చూ తగ్గుతుంది, అందరి ఆరోగ్యమూ బాగుపడుతుంది!'' అంటూ నాన్నమ్మ తలమీది పైమ పంచను సరిదిద్దుకుంటూ నవ్వో ఇస్తుంది కలగజేసుకొని.

నాన్నమ్మ అలా గుండూ, పైమ పంచెతోనే పుట్టిందా అనిపిస్తుంది చంపకి. తాతయ్య బతికి ఉండే రోజుల్లో తను ఎలా ఉండేదో చెప్పేది నాన్నమ్మ. ఆ రోజుల ముచ్చట్లూ, తాతయ్య ఘన కార్యాలూ సాయంకాలం వేళ కూర్చోపెట్టి చెప్తుంది. అవే సంగతులు విని, విని మరి వినలేక వినడం మానేసింది చంప.

నెలకు పదిహేను రూపాయలు తెచ్చుకొనే తాతయ్య ఎలా ఇల్లు కట్టేడో, ఎలా ఏనమండుగురు కూతుళ్ళకీ పెళ్ళిళ్ళు చేసేడో ... ఇంట్లో ఎప్పుడూ రెండావుల పాడి అది ఎలా ఉండేదో ... గడ్డ పెరుగూ, ఆవునెయ్యి తినలేక తినలేక ఎలా మొహం మొత్తేదో ... నాన్న ఆ చిన్నతనంలో ఎంత బలంగా, పసిమి ఛాయతో అందంగా ఉండేవారో ... ఇవన్నీ ఏకరువు పెడితే అవన్నీ విని విని... ప్రస్తుత పరిస్థితి తలచుకుంటే నమ్మశక్యం కాకుండా ఉండేది! అవన్నీ కట్టుకథల్లా అనిపించేవి. ఆ దుబారాకీ, పెద్దతనానికీ అలవాటుపడ్డ నాన్నమ్మ, వంటింట్లోకి వెళ్తోందంటే అమ్మకి భయం. నాన్నమ్మకి పొదుపు అనేది తెలీదని అమ్మ ఫిర్యాదు. మూడు రోజులకని తెప్పించిన కూరలు ఒక్కపూటకే వండేసి, అంతంత వడ్డించేస్తుంది. అమ్మ కలగజేసుకొనేది కాదు మొదట. కాని తరవాత, తరవాత కలగజేసుకొని —

''అలా కాదత్తా! రోజురోజుకీ, రోజులు మండిపోతున్నాయి. వంకాయలు ఏనాడన్నా కిలో రూపాయిచ్చి కొన్నామా? వీశె అణాకి కొన్న రోజులుండేవంటే ఎవరు నమ్ముతారిప్పుడు? ఆనాడలా దొరికేవి ... తినేవారు! ఇప్పుడు కరువు రోజులొచ్చి పడ్డాయి. ఉన్నదాంతో మనం సరిపెట్టుకోవాలి!''

అంటూ మార్చడానికి చూసేది. కాని నాన్నని సిగరెట్లు మానమని ఎలా మార్చలేకపోయిందో, నాన్నమ్మనీ మార్చలేకపోయింది. అందువల్ల, "మీకెందు కత్తయ్యా శ్రమ? మీ ఆరోగ్యమా బాగోలేదు ... పొద్దున్నే లేచి స్నానం చేసి మడికట్టుకొని వంట చెయ్యడం మీవల్ల కాదు!" అంటూ మెల్లిగా ఆటంకపరిచేది.

## 2

నాన్నమ్మని వంటింటి నించి తప్పించే అవసరం లేకుండానే, గుడ్డిలో మెల్లలా, నాన్నమ్మ ఎప్పుడూ తిరుగుతూ ఉండేది. ఓ నెల రోజులపాటు ఇక్కడుంటుందో లేదో, విశాఖపట్నం నించో, రాజమండ్రీ నించో, కాకినాడ నుంచో ఉత్తరం వచ్చేది—

"అత్తగార్ని వెంటనే రైలెక్కించేస్తే ఇక్కడ మేం దించుకుంటాం. మీ చెల్లెలికి ఆరోనెల వెళ్లింది..." అంటూ... లేదా... "మీ మరదలుకి ఏడో నెల... అమ్మని వెంటనే పంపు!" అంటూ తమ్ముడి దగ్గర్నుంచో ఉత్తరం వచ్చేది.

ఆ ఉత్తరం రాగానే, రైలెక్కి పోయేవరకూ నాన్న ప్రాణాలు తీసేది నాయనమ్మ. ఎనమండుగురు కూతుళ్లు, నలుగురు కొడుకులూ ఎన్నో ఊళ్లలో— అందువల్ల నాన్నమ్మ కోసం బోలెడు డిమాండు! ఓసారి వెళ్లిపోతే మరి ఆరు నెలల వరకూ రావటం పడేదికాదు.

టూర్ నించి నాన్నమ్మ తిరిగి వస్తుందనగానే ఎక్కడలేని ఆనందమూ కలిగేది చంపకి. వెళ్లేటప్పుడు ఓ చిన్న పాత ట్రంకుపెట్టెలో తన సైను పంచలూ, అక్కడి కూతురు కోసం కాని, కొడుకు కోసం కాని, వారి పిల్లల కోసం కాని చేసిన

# స్పందన

జంతికలూ, చేగోడీలూ పట్టుకవెళ్లేది. దానికే నాన్న పెద్ద రాద్ధాంతం చేసేవారు. "మానె శేరు నాలుగయి కూర్చుంది... నే ఎక్కడ్నించి తేను!" అంటూ.

కాని నాయనమ్మ తెలివైనది. ఏ కూతురు ఇంటికి కాని, కొడుకు ఇంటికి కాని వెళ్లాలో, ఆమె ముందుగానే గ్రహించి, మూడు నెలల ముందునుంచీ రోజూ అయ్యే వెచ్చాలలోంచి మానె, నెయ్యి, సెనగపిండి, బియ్యప్పిండి కొద్దికొద్దిగ తీసి వేరే అట్టేపెట్టేది.

ప్రయాణం రేపనగా ఇవాళ, నాన్న ఆఫీసుకి వెళ్లిపోయేక పొయ్యి వెలిగించిందంటే పిండివంటలున్నాయన్న మాటే! సలసలా మానెవాసన ముక్కుకి ఘాటుగా తగిలేసరికి చంపకి నోరూరేది. ముందుగానే నాన్నమ్మ హింటిచ్చేది... "ఇవాళ స్కూలుకి వెళ్లకే చంపా! చేగోడీలు వత్తిపెట్టాలి!" అనేది. ఆ ఆర్డరు కోసమే ఎదురు చూస్తున్న చంప ఎగిరి గెంతువేసేది.

సాయంత్రం నాన్న ఆఫీసు నించి వచ్చేసరికి జంతికలూ, చేగోడీలూ, మైసూరుపాకం ముక్కలూ నాన్న ముందు ఓ వెండిపళ్లెంలో పెట్టగానే నాన్న మరో ప్రశ్న లేకుండా తినేసేవారు. నాన్నమ్మ అంత బాగా చేసేది.

టూర్ వెళ్లి తిరిగి వచ్చేటప్పుడు నాన్నమ్మ ఓ కావిడి సట్టే వస్తువులతో వచ్చేది. అందుకే నాన్నమ్మ వెళ్లిన నెల రోజుల దగ్గర్నించీ నాన్న లెక్కలు కడుతూ ఉండడం చంప గమనించేది.

"అమ్మ ఎప్పుడొస్తుందిట?" అంటూ అమ్మని అడుగుతే — "ఏది? వెళ్లి ఇంకా నెల కాలేదు — అప్పుడే అమ్మ గురించి బెంగపెట్టుకుంటున్నారేం?" అంటూ అమ్మ సతాయించేది.

నాన్నమ్మ ఇంత వేగం తిరిగిరావటం అమ్మకిష్టంలేదు. ఆమె ఉండడంవల్ల అమ్మకి పని ఎక్కువేకాని తగ్గదు. మడీ, ఆచారం తూ, చా తప్పకుండా పాటించాలి. నాన్నమ్మకి వంట వేరు. రాత్రి ఫలహారం, ఉప్పుడు పిండో, పొట్టికట్టో, దిబ్బరొట్టో—ఇదంతా అదనపు ఖర్చూ, శ్రమామా. నాన్నమ్మ వెళ్లిన మర్నాటినించీ అమ్మకి సగం పని తగ్గేది.

కాని నాన్నమ్మ రాగానే, చంపా, తక్కిన పిల్లలూ, ఆవిడ తెచ్చిన సరంజామా మట్టూ మూగేవారు. అప్పడాలు, గుమ్మడి వడియాలు, పేల వడియాలు, మినపసున్ని ఉండలు, పాకం చలిమిడిముద్ద రెండు శేర్లు, చేగోడీలూ, జంతికలే కాక చక్కిలాలు, లడ్డూ ఉండలు, విస్తళ్లు (తనకోసం), అమ్మకో చీరా, రవికలగుడ్డా, ఆమె కోసం రెండు సైను పంచలు, మాకు బట్టలు, అన్నీ తీసుకవచ్చేది.

"అక్కడ అమ్మ చేసిన చాకిరీకి ఫలితం ఇది — మనిషినే వేరుగా వాళ్లు పెట్టుకుంటే ఎంత ఖర్చవుతుందో నీకు తెలీదా? వాళ్లకేం? లేదా పోదా?" అంటూ నాన్న లెక్చరివ్వగానే అమ్మ, వాళ్లని సపోర్టుచేసి నాన్నని తృప్తపెట్టేది.

నాన్నమ్మ తెచ్చిన తినుబండారాలని, నాన్నతో సహా అందరూ సేంపిల్‌గా రుచి చూసేక, వాటికి రేషనింగ్ పెట్టేది అమ్మ. అవన్నీ తగు మోతాదు

లలో ఓ నెల మీద పది రోజుల వరకూ పంచడు జరిగేది. రాజమండ్రి వెళ్తే, ఆ కాలంలో దొరికే పళ్లూ, గుంటూరు వెళ్తే పూతరేకులూ, కాకినాడ వెళ్తే మామిడితాండ్ర, కొబ్బరి ఉండలూ, సొంపేట వెళ్తే జీడిపప్పూ, వేరుసెనగలూ, ఓ బస్తానిండా కొబ్బరికాయలూ పట్టుకవచ్చేది. డబ్బు లెక్కకడితే ఈ పట్నంలో వాటి విలువ ఆ చవక రోజుల్లో నందకి పైగా ఉంటుంది.

అభిమానం, ప్రేమ, ఆప్యాయతా లెక్కకడితే మాత్రం అవి అమూల్యమైనవి!

ఇప్పుడు నాన్నమ్మ ముసలిదయిపోయింది. ఆమెకింక కూతుళ్లకీ, కోడళ్లకీ చేసే ఓపికా తగ్గిపోయింది. అయినాసరే ఇప్పటికయినా చెరుకుగడ ఇస్తే పళ్లతో తొక్కతీసి, నమిలి, రసం పీల్చి, పిప్పి పారేసి, గడంతా అరగంటలో పూర్తిచేస్తుంది.

"ఒసే చంపా! నువ్వూ, అన్నా వెళ్లి, ఓ నాలుగు గడలు తీసుకరండి!" అనేది. చంపా, రామం, శ్రీనూ కలిసివెళ్లి, మసక చీకటిలో, పంచదార మిల్లుకి వెళ్లే చెరుకుగడల బళ్లవెంటపడి, చెరొక గడా లాగేసి తీసుకొస్తారు. బండివాడు "హే... హే! హే! ఎవురదీ!" అని కేకపెట్టడం తప్ప బండి దిగి వెంటపెట్టలేడు. ఆఖరు బండిని ఎంచుకొని, ఆ బండిలోంచి లాగడం, తక్కిన పిల్లల్తో సహా చేస్తారు.

నాన్నమ్మ మనవల ప్రతాపానికి ఆనందించి, చిరునవ్వుతో భుజం తడుతుంది. ఆమె, ఈ చెరుకు గడలు తన హక్కు భుక్తమయినట్టు అనుకుంటుంది. అవి దొంగతనంచేసి తెచ్చినవని అనుకోదు. ఏ వస్తువన్నా కొనడం అంటే ఆమె మనసు గిలగిలా కొట్టుకపోతుంది.

పాలవాడితో అమ్మ కలబడ్డప్పుడు, అంతకన్న ఎక్కువగా నాన్నమ్మ కలపడేది. "ఎక్కడా, వెన్నంటూ చేతికి తగల్దేమిరా, గిలక్కొడితే?" అంటుంది సత్తెకాలంగా. పాలవాడు నవ్వుతాడు. "శేరు రూపాయిన్నర పాలకే వెన్నరాదు, శేరు పన్నెండణాల పాలకి వెన్న ఎలా గొస్తుంది ముసలమ్మా?" అని వాడు తిరిగి ప్రశ్న వేస్తాడు నవ్వుతూ —

ఇప్పుడు నాన్నమ్మ టూర్లు వెళ్లడం తగ్గించేసింది. నాన్నే ఆమెకు పెద్దకొడుకు కాబట్టి, ఇక్కడే ఉంటుంది. అయినాసరే వదలరు! కూతుళ్ళు వచ్చి అమ్మని తీసుకుపోతారు. "నే చెయ్యలేనే! నా కింకా ఓపిక లేదు!... మీకు కనడానికయితే ఓపిక ఉంది కాని, నా కింకా చాకిరీకి ఓపికలేదమ్మాయ్!" అంటుంది నాన్నమ్మ!

"నువ్వలా ఎచ్చి కూర్చుందూ అమ్మా! నువ్వేం చెయ్యనౌసరం లేదు! అంతా మేం చూసుకుంటాంగా? పనిమనుషులున్నారు!" అంటారు కూతుళ్ళు తమకు ఎందరో నౌకర్లున్నట్టు చాటుకుంటూ —

ఏళ్ళు గడిచిపోతూ ఉండగా నాన్నమ్మ ఓపిక పూర్తిగా సన్నగిల్లింది. అందువల్ల ఆమెని ఉంచుకోవడంలో కొడుకులకీ, కూతుళ్ళకీ లాభం కన్న నష్టమే ఎక్కువ కనిపించడంతో అమ్మని తమ దగ్గర ఉంచుకొని పోషించుకుందికి వంతులు పడ్డారు కొడుకులు. "మువ్వో మూడు నెలలూ, నువ్వో రెండు నెలలూ" అంటూ —

ఆమె ఇక్కడ రెండు నెలలుండగానే, కాశీపతి, తమ్ముడికి ఉత్తరం రాస్తాడు — "వచ్చే నెల జీతం అందగానే అమ్మని రైలెక్కించేస్తాను" అంటూ.

అటునించి వెంటనే తమ్ముడి ఉత్తరం... "నీ మరదలి ఆరోగ్యం అంతంత మాత్రంగానే ఉంది. పిల్లలతో చాకిరీ చేసుకోలేకపోతోంది అమ్మ చాదస్తం నీకు తెలుసు కదా? వదిన తప్ప ఆమెతో మరెవ్వరూ నెగ్గలేరు. కాబట్టి, నెల నెలా పాతిక రూపాయలు నీకు పంపుతాను... అమ్మని అక్కడే ఉండనీ!"

చంప, స్కూల్నించి వచ్చేసరికి, నాన్న అంత ఎత్తున ఎగిరిపడుతూ ఉంటే, చిన్నాన్న వగ్గర్నించి ఉత్తరం వచ్చిందని గ్రహిస్తుంది. "ముష్టి పాతిక రూపాయలు పంపుతాడా!? ఒక మనిషికి నెలకెంత ఖర్చవుతుందో వీడికేమయినా ఐడియా ఉందా? సరే! తిండి సంగతలా వదలవయ్యా - నీ పెళ్ళామేనా చాకిరీ చేసుకోలేనిది? నా పెళ్ళానికే ఎక్కడలేని ఓపికా ఉందికామోసు! ఈ చాకిరీకి ఎంత డబ్బివ్వగలవ్?" అంటూ, నాన్నమ్మ వింటున్నదన్నా లెక్కచెయ్యకుండా మండిపడతారు.



నాన్నమ్మ ఏమీ బాధపడదు. "ఓరే నానిగా! ఫస్టుకి నన్ను రైలెక్కించే, వెళ్ళిపోతాను! వాడు రాసిందానికి బాధపడ్డమెందుకు?" అంటుంది.

అమ్మ అద్దుతగుల్తుంది. "వాళ్ళు రావద్దో అన్నప్పుడు వెళ్ళడం ఎందుకత్తయ్యా? మీకు ఓపికున్నన్నాళ్ళూ మీ చేత అందరూ చాకిరీ చేయించుకున్నారు. ఓపిక సోగనే ఎవరికీ వారి అమ్మ అవసరం లేదు! ఇక్కడే ఉండండి! మీ మంచీ, చెడ్డా నేను చూసుకుంటాను లెండి!" అంటుంది.

అమ్మ ఆ మాటలు అనగానే, నాన్న అమ్మకేసి మింగేసేటట్టు చూసి, "నువ్వు నోర్మూయ్యి! ప్రతిదానికీ తగుదునమ్మా అని వస్తావు! మన అనువు చూసుకోనే వాళ్ళు ఆటలాడుతున్నారు. దిమ్మచెక్కలా ఉంది నీ తోటికోడలు! పని మనుషులూ ఉన్నారు. ఎందుకుంచుకోలేరూ అమ్మని? లేదా, నెలకి యాభైతక్కువ కాకుండా పంపమను!" అంటూ చిన్నాన్నకి ఓ కార్డుముక్క రాసి, చదివి వినిపించి, "చంపా! ఈ ఉత్తరం పోస్టుడబ్బాలో వెయ్యి!" అంటారు నాన్న.

ఉన్న ఆస్తిపాస్తుల ఏనాడో కరిగిపోయేయి నాన్నమ్మకి. కొడుకులే ఆస్తనుకుంది. కూతుళ్ళే దిక్కనుకుంది. తనకి ఒంట్లో శక్తీ, ఓపికా ఉన్నంత వరకూ అభిమానంతో, ప్రేమతో వాళ్ళనీ, వాళ్ళ సంతానాన్నీ సాకింది. ఇప్పుడు కొడుకులకీ, కూతుళ్ళకీ అక్కరలేకుండా పోతోంది.

"వెంకటరమణమూర్తీ! తండ్రీ! ఎంత వేగం తీసుకుపోతావో తీసుకుపో! ఆ మహరాజు స్వర్గంలో ఎక్కడున్నారో! అతన్నా కాస్త నన్ను ఓ కంట కనిపెట్టి తీసుకుపోతే ఎంత బాగున్ను!" అంటూ తనలో తను వాపోతుంది నాన్నమ్మ.

అప్పుడు చంప, నాన్నమ్మ చెయ్యి పట్టుకొని అంటుంది... "మేం అంతా ఉన్నాం కదా నాన్నమ్మా? నువ్వు మాకు కావాలి"

వెంటనే ఆమె చంపని కౌగిలించుకొని, "నా అమ్మే! నా తల్లే! నా బంగారు కొండే! నీ పాటి బుద్ధీ జ్ఞానం నా కడుపున పుట్టిన కొడుకులకుంటే ఎంత బాగుణ్ణే!" అంటుంది.

ఇంట్లోని పిల్లకాయలందరికీ నాన్నమ్మే మద్దతు!

ఎవరినన్నా పిల్లల్ని నాన్న ఫెడేల్మని కొట్టగానే, నాన్నమ్మ వినాలని వాళ్ళు కెవ్వుమని ఏడుస్తారు. ఆ ఆర్తనాదం వినిపించగానే, ఎక్కడుంటుందో గబగబా వచ్చేసి "ఏమిట్రా! పిల్లల్ని అలాగేనా కొట్టుకుంటారు? బుద్ధీ జ్ఞానం లేకపోతే సరి!" అంటూ నాన్నని చిన్నపిల్లల్ని అదలించినట్టు అదలిస్తుంది. నాన్నని అలా చీవాట్లు వేసేక, దెబ్బలు తిన్న పిల్లడ్ని తీసుకుపోయి, ఎక్కడో దాచిఉంచినదేదో వస్తువు పెట్టి, "పెరట్లోకి వెళ్ళి తిని! ఎవరికీ చూపించకు!" అంటుంది.

ఆ పిల్లవాడు ఆ వస్తువుని, అందరికీ చూపించి చూపించి, అందరినీ ఉడికించి, ఇంతింత పిసర్లు పెట్టి తింటాడు.

## 3

నాన్నమ్మకీ, నాన్నకీ అప్పుడప్పుడు తగువయ్యేది. ఏదో మాటకి మాట వచ్చేది. ఎడా పెడా నాన్నమ్మ, నాన్నని తిట్టి, తనకున్న మూటా ముళ్లే చుకన పెట్టుకొని, ఊళ్లోనే ఉన్న పెద్ద కూతురు దగ్గరకు వెళ్ళిపోయేది.

ఆమెకున్న ఎనమండుగురు కూతుళ్లలోనూ, పెద్ద కూతురూ, నాల్గో కూతురూ ఈ ఊళ్లోనే ఉన్నారు. పెద్దామెకి రెండు కాళ్ళూ బోదగాళ్ళు. అందువల్ల ఆమెని బోదకాలు అత్త అని అందరూ పిలుస్తారు. ఆమెక్కూడా పైను పంచే. ఇద్దరు కొడుకులూ ఇక్కడే పని. ఒకరు ప్రయిమరీ స్కూల్లో టీచరు. ఇంకొకరు ఎవారీ కొట్టుమీద గుమాస్తా.

నాన్నమ్మ నాలుగో కూతురు పేరు బుచ్చి. ఆమెకి పెళ్లయిందన్న మాటే తప్ప ఎప్పుడూ పుట్టిల్లే గతి, తండ్రి బతికున్నన్నాళ్లూ. భర్త చింతపల్లి ఏజెన్సీలో ఎక్కడో టీచరు. ఆ ఏజెన్సీ గాలీ, నీరూ ఆమెకి పడవు. మలేరియా జ్వరం పట్టి పీడించేది. అందువల్ల భర్త అవధాని ఆమెని పుట్టింటే వదిలిపెట్టేవాడు. తండ్రి బతికిఉన్నంత కాలం పుట్టింటే ఉండి, అమ్మకి సాయపడుతూ ఇంటెడు చాకిరీ చేసేది. వచ్చే చుట్టాలూ, వెళ్లే చుట్టాలూ. ఏ పూటకీ పాతికమందికి తక్కువ లేచేవారు కాదు భోజనాల దగ్గర. తాత పోవడంతో ఆ ఇల్లు అమ్మడం, ఉన్న గిన్నె ముంతా పంచేను

[48వ పేజీ చూడండి]

## అల్లరిబావ రోడ్డుమీద అల్లరి!

రాజా (కృష్ణ) కారు డ్రయివ్ చేస్తున్నాడు. అతనికేసి రివాల్వర్ గురిపెట్టి — బురఖా పన్నగా వేసుకొని ఘోషాస్త్రీలా కూర్చొనున్నాడు విక్టర్. ఈ కారుకు కాస్త దూరంలో జానీ (ప్రభాకరరెడ్డి) మరో కారులో అనుసరిస్తున్నాడు. ఇంతలో చెక్ పోస్ట్ వచ్చేసింది. అక్కడ ఇన్‌స్పెక్టర్ శేఖర్ (జయభాస్కర్), కానిస్టేబుల్స్‌తో ఉన్నాడు. ''హలో, రాజా! ఎక్కడికి ఇటెళ్తున్నావ్?'' అడిగాడు శేఖర్.

''గెస్ట్‌హౌస్‌కేసి. కొత్త గెస్ట్ వస్తే, కాస్సేపు ఎంటర్‌టైన్ చేద్దామని,'' అన్నాడు రాజా.

''ఇంకా ఈ సరసాలు, సరదాలు పోలేదన్న మాట నీకు? ఓ—కే—కేరీ ఆన్!'' శేఖర్ చెప్పాడు.

రాజా కారు స్టార్ట్ చేయడానికి విశ్వప్రయత్నం చేస్తున్నట్టు నటించి, ''ఇది ఆగితే స్టార్ట్ కాదు; స్టార్ట్ అయితే ఆగదు, బ్రదర్!'' అంటూ దిగి, బోనెట్ ఎత్తాడు. ''కొత్త కారు తీసుకోక పోయావా?'' అంటూ దగ్గరగా వచ్చిన శేఖర్‌తో ''నా కార్లో ఉన్నది విక్టర్. ఆ వెనక కార్లో ఉన్న జానీ — వీడ్ని దాటించాలని చూస్తున్నాడు. అరెస్ట్ దెమ్!'' బోనెట్ చాటుగా మెల్లగా చెప్పాడు రాజా.

''నీకేమిటి, రాజా—అమ్మేసి ఏ న్యూ మోడల్ తీసుకోక?'' అంటూ శేఖర్ పక్కకు వెళ్ళి, కానిస్టేబుల్స్‌తో ఏదో చెప్పాక, చివాలున జానీ కారు కేసి నడిచాడు. పిస్టల్ తీసి, ''హలో, మిస్టర్ జానీ! మాకు, మా రైఫిల్స్‌కు శ్రమ కలిగించకుండా నువ్వు, విక్టర్ లొంగిపోండి!'' అన్నాడు.

జానీ రివాల్వర్ తీయబోయాడు. వెనక నుంచి రాజా, ఆ రివాల్వర్‌ను ఎగరగొట్టి, కానిస్టేబుల్స్ ముందు పడేలా చేశాడు. విక్టర్‌ని, జానీని పోలీసులు అరెస్ట్ చేశారు. జానీ ఉక్రోషంతో ''రాజా! నమ్మించి మోసం చేశావ్ కదూ? ఓ—కే! నేను జైలునుంచి తిరిగి రాకపోను; నీ అంతం చూడక పోను!'' అన్నాడు.

''షటప్! సరదాకి నీ క్లబ్‌కు వస్తున్నానని — నన్ను చీప్‌గా అంచనా వేసి, డబ్బుతో కొనాలని చూస్తార్రా, రాస్కెల్స్? నా చేత ఇలాంటి తప్పుడు పని చేయించాలని ప్రయత్నిస్తార్రా, ఇడియట్స్!'' అన్నాడు రాజా. శేఖర్ వచ్చి అతనితో కరచాలనం చేశాడు.

స్టార్స్ ఇంటర్నేషనల్ ''అల్లరిబావ'' చిత్రాన్ని పి. సాంబశివరావు దర్శకత్వంలో ఎ. బాలకృష్ణ నిర్మిస్తున్నారు.



# గెలవండి తెలుపు యుద్ధం

# బోనస్ బార్ సిద్ధం

బోనస్ శక్తిని పరీక్షించి చూడండి.
కొత్త బోనస్ డిటర్జెంట్ బార్. సాటిలేని పొదుపు—
గుర్తింపు గల మరే డిటర్జెంట్ బార్‌తోనైనా సరే దీని
పనితనాన్నీ, వెలనీ పోల్చిచూడండి.
పసుపు, ఆకుపచ్చ రంగుల్లో దొరుకుతుంది
కొత్త బోనస్ డిటర్జెంట్ బార్






టాటావారి తయారీ

CASTB-26-223 TL

# సినిమా

## సంధ్యలో డాలీ దాపరికం !

సంధ్య (సుజాత), తన తమ్ముడు మధు (చంద్రమోహన్)ని వెతుక్కుంటూ రావు ఇంటికి వచ్చింది. తమ్ముడి భార్య డాలీ (గీత) "ఏం కావాలి ?" అంది.

"కులాసానామ్మా ? ఇంకా నా మీద కోపం పోలేదనుకుంటాను ? ఆ రోజు ..."

"సంజాయిషీలు అనవసరం," అంది డాలీ ముఖం పక్కకు తిప్పుకొని.

సంధ్య నవ్వింది. ఆ నవ్వులో ఎంతో బాధ ఉంది. "మధు లేడామ్మా ?" జాలిగా అడిగింది.

"బయటకు వెళ్ళారు."

"ఎప్పుడొస్తాడు ?"

"తెలీదు."

"చూడమ్మా! లతకి, జ్యోతికి పెళ్ళిళ్ళు నిశ్చయించేశాను. నాకు బంధువులు, ఆత్మీయులు అంటూ ఉన్నది మీరిద్దరేనమ్మా. అందుకే మొదట శుభలేఖ ప్రత్యేకంగా మీకు అందించి, పిలుద్దామని వచ్చాను. ఒక్కదాన్నే అన్నీ చేసుకోవాలి కదా? ఆ హడావిడిలో మళ్ళీ రావడానికి కుదరదేమో! నువ్వు, మధు పెళ్ళికి నాలుగురోజుల ముందొచ్చి మీ చేతుల మీదుగా ఆ శుభకార్యాలు జరిపించాలి," అంటూ సంధ్య ఇచ్చిన శుభలేఖను డాలీ నిర్లక్ష్యంగా పుచ్చుకుంది. సంధ్య వెళ్ళొస్తూ, "వస్తానమ్మా," అని అలా వెళ్ళిందో – లేదో మేడమీద నుంచి మధు వచ్చాడు. శుభలేఖను డాలీ అక్కడున్న ఓ ఫైల్లో దాచేసింది.

"మాటలు వినిపించాయి; ఎవరైనా వచ్చారా, డాలీ ?" మధు అడిగాడు.

"ఎవరో ఓ ఆవిడ ధర్మం చెయ్యమంటూ వచ్చింది. మామూలే కదా?" అంది డాలీ తాపీగానే.

"సరే ... ఆఫీస్‌కి వెడుతున్నాను," అంటూ మధు బయలుదేరాడు.

డాలీ తనలో తాను నవ్వుకుంది.

"తపస్య" హిందీ చిత్రం ఆధారంగా ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వంలో ఎ.ఆర్.ఎస్. శర్మ సమర్పించే శ్రీ సావరిన్ ఫిలిమ్స్ "సంధ్య" చిత్రానికి కంవర్ణ పూర్ణచంద్రరావు నిర్మాత.



'సంసారం–సంతానం'లో జయసుధ, కె. వి. చలం



'మానవుడు–మహనీయుడు'లో ఒక దృశ్యం

## వాడని మల్లి

"మూడు షెడ్యూల్స్‌లో డిసెంబర్‌కల్లా పూర్తవుతుంది. అక్టోబర్ 18న పూజ చేసి, 19న షూటింగ్ మొదలెడుతున్నాం," అన్నారు దర్శక నిర్మాత ఎ. వి. ఎం. మురుగన్. ఈయన రూపొందించే "వాడని మల్లి" చిత్రానికి డి. హరినాథరెడ్డి నవల "చీకటోళ్ళు" ఆధారం. విజయవాడలోని సుప్రసిద్ధ ఫొటోగ్రాఫర్ సీరన్న కుమార్తె సుప్రియ ఈ చిత్రంలో నాయిక. ఇప్పుడీమె స్టెల్లా మేరీస్ కాలేజీలో బి. ఎ., ఫైనల్ ఇయర్ చదువుతోంది. మిగతా పాత్రలకు కూడా కొత్తవారిని ఎన్నుకుంటారు. ఎ. వి. ఎం. మురుగన్ అండ్ కో బానర్‌లో తయారౌతుంది చిత్రం.

# సినిమా విశేషాలు

'మనసా కవ్వించకే'లో కవిత, శ్రీధర్

## ప్రేమనాటకంలో ప్రమాదాల ప్రహసనం !

చందాల కోసం వచ్చిన ప్రమదామణులతో “అయితే, అనాథ పిల్లలందరికీ మీరొక ఆశ్రమం కట్టించి పెంచుతారన్న మాట ?” అడిగింది సుందరమ్మ (గిరిజ).

“అవునండి. అదే మా లేడీస్ క్లబ్ ఆశయం,” అంది ఓ మహిళ.

మిస్టర్ సుందరమ్మ – అంటే, గోపాలం (పి. ఎల్. నారాయణ) “మీరిలా ఇరవై నాలుగ్గంటలూ అనాథ పిల్లల్ని పెంచుతూ ఉంటే, మరి — మీ పిల్లల్నెవరు పెంచుతారు ?” అని ప్రశ్నించాడు.

“మా పనిమనుషులు పెంచుతారండి. అనాథాశ్రమం నడిపించడంతోపాటు వరదబాధితులకు కూడా సహాయం చేస్తామండి,” అంది మరొకామె. “అలాంటి పనులు నిత్యం చెయ్యకపోతే, మాకు నిద్రే పట్టదండి,” అందుకుంది ఇంకో స్త్రీ.

“అయితే, మీకు నిద్రపట్టడానికి దేశంలో ఎప్పుడూ వరదలొస్తూ ఉండాలి — ఇళ్ళన్నీ బర్నింగ్స్ అయిపోతూండాలన్న మాట ?” అన్నాడు గోపాలం.

“అది కాదండీ... మా ఉద్దేశ్యం —” అని మరో వనిత సంజాయిషీ చెప్పేలోగా “ఉరికే లాఫింగ్ కోసం జోకింగ్ చేస్తున్నానంతే... డోంట్ వర్రీ, డోంట్ వర్రీ!” అంటూ సుందరమ్మ వంక తిరిగాడు గోపాలం.

అమరనాథ్ నిర్వహణలో తయారవుతూన్న పరిమళ ఆర్ట్స్ క్రియేషన్స్ “ప్రేమనాటకం” చిత్రాన్ని కట్టా సుబ్బారావు దర్శకత్వంలో నందకుమార్, స్వామి, బాలనాగయ్య, శంకరయ్య నిర్మిస్తున్నారు.



'దో షాహ్రా'లో జీనత్ అమన్

## పసిడి మొగ్గలులో ముసలి తలపులు !

లక్ష్మి దిగ్భ్రమతో చూసింది. “నేను మీకేం తక్కువ చేశానని రెండో పెళ్ళి గురించి ఆలోచిస్తున్నారు ?” అంది.

“నన్నేం సుఖపెట్టావని తక్షణం ఆలోచించుకో. జవాబు నీకే తెలుస్తుంది. జబ్బుతో మూల్గుతూ ముక్కుతూ పడుండే రోగిష్ఠి దాన్ని కట్టుకుని నేనేం బావుకున్నానో తెలీదా నీకు ? ఈ విషయం మీ నాన్నతో మాట్లాడి తేల్చు. భర్త చెప్పిన మాట వినడం భార్య కనీస ధర్మం,” ఒక్కసారిగా మనస్సులోవిదికక్కేవాడు రావణం(సత్యనారాయణ).

“ఏమి, తన మొగుడు తనే ఉరి బిగించుకోవడం కూడా భార్య కనీస ధర్మమేనాండీ ? మా నాన్న బిడరికం మీకే చాలవ తీసుకునే ధైర్యాన్నిచ్చిందండీ!” లక్ష్మి(అశ్విని)కి ఉక్రోషంతో ముఖం ముంచుకొచ్చింది. కళ్ళు తుడుచుకొని మాసేనరికి ఎదురుగా ధర్త లేదు.

కేశవరావ్ అండ్ కో సమర్పించే వనితా పిక్చర్స్ “పసిడి మొగ్గలు” చిత్రాన్ని దుగ్గిరాల నాగేశ్వరరావు దర్శకత్వంలో కేశవరాజు నిర్మించారు. జంధ్యాల సంభాషణలు, ఇళయరాజా సంగీత దర్శకుడు. లక్ష్మణ్ గోరే ఛాయాగ్రాహకుడు. గురుదేవ్ సహ దర్శకుడు.





## నవంబర్ 5న జగమొండి

“పిక్చర్ చాలా బాగా వచ్చింది. మూవీ హిట్ చెప్తారుగా ?” అన్నారు నటుడా మూవీస్ అధినేత కె. పూర్ణి సంతృప్తిగా నవ్వుతూ. ఆయన వి. మధుసూదనరావు దర్శకత్వంలో నిర్మించిన “జగమొండి” చిత్రంలో శోభన్‌బాబు, రతి, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, జానకి, రాళ్ళపల్లి, రాజ్‌కుమార్, సురేష్, గీత, రాజ్యలక్ష్మి, మాస్టర్ క్రాంతి నటిస్తున్నారు. ఎం. వి. ఎస్., చక్రవర్తి, వెంకట్, ఎస్. కృష్ణారావు, అంకిరెడ్డి తెరవెనుక కృషి చేశారు.

# ఇంటా లేదా విదేశాల స్త్రీలందరూ విశ్వసించేది హెలెన్ కర్టిస్‌వారి షాంపూలు.






అమెరికా, యూరప్, జపాన్, భారతదేశంలో...స్త్రీలందరూ ఇష్టపడేవి హెలెన్ కర్టిస్ వారి షాంపూలు. ఎందు కంటే వారి జుట్టుకు సరిపోయే పోషణ, నిగనిగలు, తళతళలు కేవలం హెలెన్ కర్టిస్ వారు మాత్రమే ఇవ్వగలరని వారికి బాగా తెలుసు. భారతదేశంలో, మీ జుట్టుకు హెలెన్ కర్టిస్ వారి టియారా ట్రీట్‌మెంట్ నివ్వండి. టియారా షాంపూలు ఏరకమైన జుట్టుకైనా సరిపడేలా తయారు చేయబడ్డాయి.

● టియారా ఎగ్ షాంపూ : తగిన పోషణ లేని జుట్టు కోసం,

● టియారా షికాకాయ్ షాంపూ : నిడుపాటి జుట్టు కోసం, ఆమ్లా మరియు బ్రాహ్మిలతో.

● టియారా బ్యూటీషాంపూ : ఒత్తైన జుట్టుకు, ఎక్కువ నురగతో మృదుత్వాన్నిచ్చేది.

## టియారా షాంపూ
హెల్త్ మరియు బ్యూటీ షాంపూలు






కేశసంరక్షణ విషయాలలో ప్రపంచ నాయకులు

everest/80/JKH/450-tl



'ఊరికి మొనగాడు'లో ఒక దృశ్యం ( ) 'ఆకాశజ్యోతి'లో సుజాత

## ప్రశ్నావళి * ప్రశ్నావళి * ప్రశ్నావళి * ప్రశ్నావళి * ప్రశ్నావళి

ఆర్. ఎస్. — కరీంనగరు.

'ఎ' సర్టిఫికెట్ పిక్చర్లు అంటే పెద్దలకు మాత్రమేనని నేను. కాదు క్వాలిటీ పిక్చర్ అని నా ఫ్రెండ్ అంటున్నాడు ?

★ క్వాలిటీ ? మన సినిమాల్లోనా ? మీది మరీ అత్యాశగా వుంది! ఎ "ఎడల్ట్సు" అనే అర్థం— (ఎడల్ట్ ప్రేడెడ్ అని ముద్దుగా అంటూ వుంటుంది— ఓ సెన్సారు సభ్యురాలు !) క్వాలిటీకి 'క్యూ' యిద్దామనుకున్నారు. ఆ మాటకీ, కోటకీ ఒకటేనా వస్తుందో రాదో అనుకున్నారో ఏమో! దొంగని తేలు కుట్టినట్టు వూరుకొని, ఆ వూసే ఎత్తడంలేదు.

వేణి — విజయవాడ.

అమ్మా — యదా యదాహి ... యుగే యుగే అన్నాడు కదా గీతలో గోవిందుడు. మరింకా అవతరించకపోవడం ఆశ్చర్యంగా వుంది. మీరేమంటారో ?

★ ఎక్కడో అవతరించి వుండబట్టే యీ సంక్షోభాలని నా నమ్మకం ... సినిమాల్లో మాదిరేదా — పాపం పందేముందే కదా రవికాంత్ ట్రిక్ ఫొటోగ్రఫీ, స్వామినాథన్‌గారి 'ఎక్స్‌ట్రా ధ్వనులు' అన్నీ విజృంభించేది ? తరవాతే కథ ... నరసింహుడో, కృష్ణుడో పాపులని వెంటపడి తరిమేది ? ... యీ ఉద్వేత్తున లేస్తున్న దారుణాలకి — అదే ముగింపు కావాలి — కథ ప్రకారం !

జి. పి. కర్నూలు.

అక్కయ్యా! మీ ప్రశ్నావళి నా కెంతో ఇష్టం. మీ జవాబులు అంటే అబ్బాయిలకు ఎందుకు అంత కోపం ? మీ విజయ సీరియల్ కదుపులిపి బాగుంది?

★ అప్పుడే సీరియల్ బాగుందనేయకు చిట్టి చెల్లీ. కథ ముగిసాక చెప్పు. ఇక, అమ్మాయిల కెందుకిష్టమో — అబ్బాయిలకి అందుకే కోపం! 'కాకిట! కావ్ కావ్ కూతలు ! 'ఇద'ట ! చెప్పదంట ! మేం వినదంట ! ఫో.' అని వాళ్ల సొద. అంతే — హేట్ కూడా ఒక రకం లైకింగే.

టి. జి. ఆర్. — అక్కుపల్లి.

మనిషి సంతోషంగా వుండాలి అంటే ప్రేమించిన వ్యక్తి అయినా వుండాలి. లేక ఆదరించి అభిమానించే తల్లితండ్రులైనా వుండాలి అనుకుంటున్నాను ?

★ అలాగా ? మీరు ప్రేమించే వ్యక్తి వున్నా మీ కోసమే మీ తల్లితండ్రులున్నా మీ కోసమే నన్నమాట ! నా దృష్టిలో సంతోషంగా వుండాలంటే — కాస్త స్వార్థచింతన తగ్గాలి. కొంచెమేనా తృప్తి అనేది వుండాలి.

ఎస్. ఎస్. ఆర్. — సికింద్రాబాదు.

ఏదో ఉద్యోగం వుంది. వెళ్లిరావడమేగాని — నిజంగా ఇష్టం లేదు. ఏం చేయాలి ?

★ కొత్తగా ఏ నిర్వాకం చెయ్యక్కరలేదు నారాయణరావుగారూ ! చేసే పనిలో శ్రద్ధ చూపించాలి. అప్పుడు అదే మిమ్మల్ని ఓ రోజు ఆదుకొంటుంది నిస్సందేహంగా.

ఎస్. ఎస్. ఆర్. ఎస్. టి. ఆర్. — బైపల్లి

ఏమండీ. ప్రేమించుకున్న ప్రతివారూ కల్సుకుంటే ప్రేమకు విలువ లేదంటాను. మీరు ? అయితే యీ ప్రేమ లేకుండా మనిషి బ్రతకలేడా ? ఎందువల్ల ? ఇప్పుడే పత్రిక చూసినా ప్రేమించాను, మోసపోయాను — ప్రేమించాను. వంచించింది అన్న విషయాలేగాని, ప్రేమించుకున్నాం. పెళ్లి చేసుకున్నాం, సుఖంగా వున్నాం — అని ఒక్కరూ వ్రాయరేం. ఏది ప్రేమ ?

★ ప్రేమించుకుని కలుసుకోకపోతే అమర ప్రేమ. ప్రేమించుకుని ఆరాధనతో ఆగితే అమరిన ప్రేమ. ప్రేమించుకుని పెళ్లి చేసుకుని సుఖంగా వుంటే — మామూలు ప్రేమ. మామూలు ప్రేమ న్యూసు కాదు. అందుకే మీ చెవికి వినబడదు.

వంతులు, గోపి — కల్లేపల్లి

దెయ్యాలున్నాయా ? ముఖ్యంగా స్త్రీలు దెయ్యాలవుతారట, నిజమేనా ?

★ నిజమే. వాళ్లకేకర — తీరని కోరికలూ! ఆవేదనలే కాదు — మనిషి కాని మనిషి బ్రతుకు కూడా రాసిపెట్టాడు మనువుగాడు ! అందుకే చచ్చేనా ధర్మశాస్త్రం మారుద్దామని ఆడాళ్లు దెయ్యాలవుతారు ! బ్రతికుండే దెయ్యాలవుతారు కొందరు ! సర్వైవల్ కోసం.

ఇ. ఆర్. కె. ఆర్. — కంచేరు

ప్రపంచంలోకెల్లా విలువ కట్టలేని వస్తువు పేరు చెప్పకలరా ?

★ ఇహిహి... తల్లిప్రేమ ! !

# సున్నితమైన అందం సరిత అందం... ఆ అందాల తార కోరుకునేది మృదుత్వాన్నిచ్చే లక్స్.

సరిత అంద్దం సున్నితంగా, ముచ్చటగొల్పే అందం. ఆమె కోరుకునే మృదుత్వం కోసం ఆమె ఎప్పుడూ ఎన్నుకునేది లక్స్.

"నా చర్మ సౌందర్యాన్ని మృదువుగా, అందంగా తీర్చిదిద్దేది లక్స్. అందుకే నేనెప్పుడూ కావాలని కోరుకునేది లక్స్". అంటుంది సరిత.




శుద్ధమైన, సౌమ్యమైన లక్స్—
సినిమా తారలకు సౌందర్యాన్నిచ్చే సబ్బు

హిందుస్తాన్ లీవర్ లిమిటెడ్ వారి విశిష్ట ఉత్పాదన

HLL 6102



త్వరలో
రాగలహరి
సీరియల్

ఆప్కాబ్ డిపాజిట్ల సేకరణ ఉద్యమం సందర్భంగా ఆఖరి రోజున రవీంద్ర భారతిలో ఏర్పాటుచేసిన ఉత్సవంలో పాల్గొన్న కళాకారులలో సినీనటుడు శ్రీ కృష్ణంరాజు, నృత్య ప్రదర్శన ఇచ్చిన కుమారి జయంతి రాజగోపాల్‌తో హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఆల్లాడి కుప్పుస్వామి, ఆప్కాబ్ చైర్మన్ శ్రీ వి. కె. రావు, మేనేజింగ్ డైరెక్టర్ శ్రీ జి. కుమారస్వామి రెడ్డి, జనరల్ మేనేజరు శ్రీ ఎస్. వి. ఎస్. ఎన్. రాజు ఈ చిత్రంలో ఉన్నారు.

## ప్రశ్నావళి

సి.హెచ్. ఎన్. ఆర్. — మిట్టపల్లి

ప్రేమ గుడ్డిదంటారెందుకు?

★ మీ కంటికి రంభ, ఎదుటి కంటికి శూర్పణఖగా తోచడంవల్ల.

వై. హెచ్. ఎస్. ఆర్. — డోర్నకల్

లోకంలో ప్రతి మానవుడు సుఖాన్నే ఆశిస్తాడెందుకు?

★ కష్టాలని గడపడానికి అదొక మార్గం.

ఎ. ఎస్. ఆర్. — వేంపూరు

పురుషుని పాలేరుగా చూస్తారని ఇల్లరికం పోరు. కాని స్త్రీని దాసిగా చూస్తూ కోడలిగా తెస్తారు. స్త్రీలు వస్తారెందుకని. ఈ వ్యవస్థ మారదా?

★ 'పిల్ల — పిల్లాడు' ముఖ్యం అనుకునే రోజు వచ్చేదాకా యింతే!

ఎమ్. టి. ఆర్. — చేతంచెర్ల

ప్రేమలో ఓడిపోయిన మగవాడికి సుర, మధువు దేవుడిచ్చిన వరాలు. మరి స్త్రీలకు ఏమిటి?

★ స్త్రీ పురుషునిలా పిరికిది కాదు — పలాయనవాదం పఠించడానికి. తనకై దక్కనివాడిని ప్రేమిస్తుంది ఆడది. అలాంటి ప్రేమకి ఓటమి వుండదు. మీ మగవాళ్లు దానినే 'సద్దుకుపోయే తనం' అని హేళనచేస్తారు. కాని అదే — జీవితం సాగించడానికి — సరైన దారి. సహజీవనం సద్దుకుపోవడం నాణేనికి రెండు పక్కలు.

వివాహం చేసుకోడానికి చట్టంలో పనిలేదు గాని, విడాకులు కెందుకింత హంగామా?

★ బాగా చెప్పారు. అందుకే కదా — రెండో, మూడో పెళ్లిళ్లు చక్కగా సరదాగా చేసేసుకుంటున్నారు! విడాకులూ యింత సులభం అయితే — ఎంత బాగుండునో — రోజూ పెళ్లే కదూ?!

— కె. రామలక్ష్మి

కోడం జరిగిపోయాక, బుచ్చి ఓ చిన్నగది అద్దెకు తీసుకొని, కాశీపతి ఉండే వీధిలోనే ఉంటోంది.

''నేను నా బుచ్చికూతురు దగ్గరకి పోతాను!'' అంటూ అక్కడకు పోతుంది నాన్నమ్మ. అక్కడ నాలుగయిదు రోజాలుండగానే పెద్దకోడలు వెళ్ళి ఆమె అలక తీర్చి, తీసుకొస్తుంది.

అవధాని (బుచ్చి భర్త) ప్రతీనెలా భార్యకి డబ్బు మనీఆర్డర్ చేసేవాడు. మనీఆర్డర్ వచ్చిన రోజు అజ్ఞాయింపుగా అందరికీ తెలుసు. పోస్ట్ మాన్ అల్లంత దూరంనించీ కేకపెట్టేవాడు – ''రాజ్యలక్ష్మిగారూ ! మీకు ఎమ్. ఓ. !'' అంటూ.

చంపా, రామం, శ్రీను పరుగున వెళ్ళేవారు. డబ్బు అందుకున్నాక పిల్లలందరికీ తలో పావలా ఇచ్చేది.

ఏజెన్సీనుంచి అవధాని మామ రావడం గుర్తుంది చంపకి. తెలతెలవారుతూ ఉండగానే కబురొచ్చేది, అవధాని మామ వచ్చినట్టు. నాన్న ''వచ్చేడూ ! అయితే పద, వెళ్ళి చూసొద్దాం !'' అంటూ హుషారుగా అనేవారు.

చంపా, రామం, నాన్న కలిసి బుచ్చి అత్త ఇంటికి వెళ్ళేవారు. గది ముందుకున్న గచ్చు అరుగు మీద కూర్చొనేవాడు అవధాని. ఓ దర్భాసనం వేసుక కూర్చునేవాడు.

జడల సన్యాసిని చూసి అతణ్ని వేరేగా చూడ నౌసరం లేదు.

ఆరడుగుల పొడవు మనిషి. పొడుగాటి గడ్డం, ఛాతీమీదకు పడుతూ పొడుగాటి తల వెంట్రుకలు, భుజాలమీదకి జాలువారుతూ ఒక వదులు చొక్కా, గళ్ళలుంగీ వేసుకుని మఠం వేసుకు కూర్చొనేవాడు.

చేతిలో చిలుము గొట్టం ఉండేది. పొద్దున్న లేవగానే ఆ చిలుము గొట్టాం తుడిచి, దానికి గుడ్డ చుట్టి, అందులోకి ఏజెన్సీనుంచి తెచ్చిన భంగు దట్టించి, పొయ్యిలోంచి చిన్న నిప్పురవ్వ తీసి గొట్టంలోవేసి ముట్టించి, గొట్టాన్ని రెండుచేతుల్లోకి తీసుకొని, పెదవుల దగ్గరకి తీసుకువెళ్ళి పఫ్, పఫ్ మంటూ పొగపీల్చి వదిలేవాడు, పొగ పీల్చేటప్పుడు కళ్ళు మూతలు పడేవి. ఈ ప్రపంచంలో పొగ పీల్చడమే తప్ప మరో సంగతి గుర్తు ఉండనట్టు. గుండెల నిండా గంజాయి పొగపీల్చేక ఆ పొగని

# స్పందన

[37వ పేజీ తరువాయి]

వదుల్తూ ఉంటే ముఖంమ్మీద చిద్విలాసమైన ఆనందం.

ఆ తంతుని చంపా, రామం వింతగా గమనించే వారు.

''ఏం చేస్తున్నావు మామయ్యా !'' అని చంప అడిగేది.

''అమ్మాయికి చీరకడుతున్నానే చంపా !'' అనేవాడు, గొట్టానికి గుడ్డ చుడుతూ. ఇద్దరికీ పరిచయం పెరిగాక ఆ సంభాషణ.

మొదటిసారి అవధానిని చూసినప్పుడు చంప భయపడింది. కాని అతడిలో ఏదో ఆకర్షణ.

అవధాని మామ శెలవలకి వచ్చేవాడు. శెలవలకిక్కడ ఉన్నన్నాళ్ళూ పిల్లలంతా అతడి చుట్టూ మూగేవారు. ఎన్నో కథలు చెప్పేవాడు. ఆటలు ఆడించేవాడు. ఐస్ కొనుకుందుకి డబ్బులిచ్చేవాడు. కాని ఈ ప్రపంచంలో తనకీ, చిలుముగొట్టంకి తప్ప మరి తక్కిన వారితో సంబంధం లేనట్టుండే వాడు. ఇల్లు కదిలి ఎక్కడికి వెళ్ళేవాడు కాదు. ఏ పనీ చేసేవాడు కాదు. ఎవరన్నా వచ్చి కబుర్లు పెట్టుకుంటే, ఆ ఏజెన్సీ, అక్కడి మనుష్యులూ, వారి జీవనవిధానం గురించి ఉపన్యాసాలిచ్చేవాడు.

అవధాని మామయ్య వస్తే నాన్న కెందుకంత ఆనందమో, చంపకి మొదటిసారే తెలిసిపోయింది.

నాన్న చిరునవ్వులు చిందుతూ పలకరింపు – ''ఏం బావాజీ ! ఎప్పుడు రావడం ? బహుకాల దర్శనం అయిపోయిందీసారి !''

''నిన్న రాత్రే వస్తి ! బస్సు దారిలో బ్రేక్ డౌన్ అయింది. దానిని తోసి తోసి గూళ్ళు పులిసి పోయేయి !'' చిలుముగొట్టానికి చీరకడుతూ మామయ్య !

బుచ్చత్త మొహం ఆనందంతో కొత్త పెళ్ళి కూతురు మొహంలా ధగధగా మెరిసిపోతూ ! ''రా అన్నయ్యా! రా!'' అంటూ ఆప్యాయంగా పలకరింపు.

కొడుకు సుబ్బన్న, అవధాని పక్కనే కూర్చొని ఆబగా తండ్రిని చూస్తున్నాడు.

రంగడి కొట్టునుంచి సిగరెట్ పెట్టె తెమ్మని చంపకి, నాన్న ఆ పొద్దున్న చెప్పలేదు. ''ఏం చెప్మా ?'' అని అనుమానం కలిగింది చంపకి. ఇప్పుడా అనుమానం తీరిపోయింది.

నాన్న కూడా అవధాని పక్కనే చతికిలపడగా, అవధాని చిలుముగొట్టానికి చీరకట్టి, అందులో గంజాయి దట్టించి, నిప్పు అంటించి, ఓ రెండు దమ్ములు లాగి, నాన్నకి ఆ గొట్టం అందించగా, నాన్న కూడా రెండు దమ్ములు లాగి ఆనందంగా కబుర్లలో పడగా, అత్త పిలుపుమీద చంప గదిలోకి వెళ్ళింది.

మామయ్య ఏజెన్సీనుంచి తెచ్చిన తేనె చిన్న ఉగ్గుగిన్నెలోనూ, ఒక పళ్ళెంలో రెండు బొంత అరిటిపళ్ళు పెట్టి, ''తినవే చంపా!'' అనేది అత్త. ఎంతో రుచిగా ఉండేవి తేనే, పళ్ళూ.

అవధాని మామ ఉన్నన్నాళ్ళూ నాన్న పొద్దున్న లేవగానే అక్కడికి వెళ్ళి ఆరునుంచి ఏడువరకూ ఉండి, చిలుముగొట్టం పీల్చందే ఉండలేకపోయేవారు. ఆ విషయంలో అమ్మకీ, నాన్నకి వాదోపవాదాలు సాగేవి.

''ఈ సిగరెట్ అలవాటు సరేసరి ! ఇంకా ఆ చిలుముగొట్టం కూడా అలవాటయితే సరేసరి ! ఆ తరవాత అతగాడిలా ఆ ఏజెన్సీ మన్యాలలోకిపోయి ఉంటామంటారు ! మంచి రమ్మంటే రాదు కాని, చెడు ఎంతలోకి రావాలి !'' అంటూ సణుగుతుంది.

నాన్న చిద్విలాసంగా చిరునవ్వు నవ్వి, (ఆ చిద్విలాసం చిరునవ్వు భంగువల్లే వచ్చింది) ''భంగు పీల్చడం కన్నా చాలా చెడ్డపనులు ఎన్నో ఉన్నాయే ! భంగు పీల్చడం చాలా మంచిపని ! అది పీల్చడం అలవాటయిన మనిషి ప్రపంచంలో ఉన్న ఎన్నో చెడ్డపనుల జోలికిపోడు !'' అంటూ సమాధానం !

''ఔన్లెండి ! చెడ్డపనుల జోలికిపోడు ! మంచి పనుల జోలికిపోడు ! అలా మగత కమ్మినట్టు రోజల్లా పడి ఉంటాడు. మర్నాడు ఆ వేళకి అది లేకపోతే నిప్పుతొక్కిన కోతిలా గెంతుతాడు !''

అవధాని మామయ్య వచ్చేక, నాన్న ప్రతి చిన్న విషయానికీ చిర్రుబుర్రు లాడకపోవడం చంప గమనించింది. భంగు మనిషిమీద ఒక మగతనిద్ర వంటి మగతని కప్పుతుంది కామోసు ! అనుకుంది. కప్పని మింగిన పాములా నాన్న కనిపించగానే, అమ్మ మార్చి మార్చి చూసేది నాన్నని, డాక్టరు పేషెంటుని పరిశీలిస్తున్నట్టు. ఓ విధంగా చూస్తే, నాన్న సాధువులా ఉండడం అమ్మకి ఆనందమే. మరో విధంగా చూస్తే భయం. ఈ అవధాని వెళ్ళి పోయిన మర్నాటినుంచీ ఈయన వాలకం ఎలా ఉంటుందో ! అన్నది భయం.

అవధాని తమ ఇంటికి వచ్చినప్పుడు అమ్మ టీ కాచి ఇచ్చి, అన్ని కుశల ప్రశ్నలూ వేసి, చిన్న వార్నింగిచ్చేది. ''అన్నయ్యా ! మీరు ఆయనకి ఆ చిలుం మాత్రం ఇవ్వకండి ! అలవాటయిందంటే ఆనక నేను చావాలి !''

అవధాని చిరునవ్వుతో, ''సరేలేవమ్మా !'' అనేవాడు, వాదించటం ఎందుకని. కాని మర్నాడు పొద్దున్న అంతా మామూలే !

(ఇంకా ఉంది)



# నమ్మలేని నిజం...

(18 వ పేజీ తరువాయి)

ఉరిశిక్ష వేశాడన్న మాటేగాని జస్టిస్ జగన్‌కు మానసిక ఆందోళన ప్రారంభమైంది. సీత విషయాన్ని ఒప్పుకోవటంలేదు. తన అంతరాత్మ ఆలోచన రీతిలో తీర్పుయిచ్చాడు. నేరం ఒక్క సీతే చేసింది అనటానికి పరిస్థితులు పర్మిట్ చేయటం లేదు. ఒకవేళ గోవర్ధన్ నేరస్థుడు కాకపోతే, పై కోర్టు వారు ఉరిశిక్ష ఆపుచేయవచ్చుగా! అయినా తను వేసిన శిక్ష తగినదే అనే నమ్మకంతో ఆ రాత్రి నిద్రపోయాడు జస్టిస్ జగన్.

తరువాత జడ్జిమెంటు సరియైనదేనని, మరణ శిక్షను ధృవపరుస్తూ హైకోర్టు నుండి ఉత్తరువు వచ్చింది.

జస్టిస్ జగన్ మానసిక ఆందోళన యింకా ఎక్కువైంది.

ఆరోజు గోవర్ధన్‌కు, సీతకు ఉరిశిక్ష. సీత నేరాన్ని ఒప్పుకుంది, గోవర్ధన్ ఒప్పుకోలేదు. తను జీవితంలో ఒక తప్పు చేశానేమోనని జస్టిస్ జగన్ చాలా బాధపడ సాగాడు. అయినా చేసేదిలేక అలాగే ఆరాత్రి నిద్రపోయాడు.

మరుసటిరోజు తెల్లవారు ఝామున గోవర్ధన్‌ని, సీతని ఉరితీశారు. జైలు సూపరిండెంటు ఉరితీసిన తరువాత సీత యీ లెటరు మీకు యిమ్మందని, అంటించిన కవరు ఒకటి జస్టిస్ జగన్‌కి యిచ్చారు. అందులో యిలా వుంది—

“జస్టిస్ జగన్‌గారికి,

ఇది ప్రేమలేఖ కాదు. నాకేసు విచారణలో మీరు ఎంత మానసిక ఆందోళన చెందారో నేను వూహించాను. నాకేదైనా సహాయం చేద్దామని మీరు పడ్డ ఆవేదన నిజంగా మరుపురానిది. కాని మీ సానుభూతికి తగను. ఈ నేరం జరిగిన తరువాత నాలో మానసికమైన మార్పు వచ్చింది. వాస్తవానికి నేను, గోవర్ధన్ కలిసి రామూగారిని చంపాము. కాని తరువాత అతనికి, నాకు జరిగిన ఒప్పందం ప్రకారం నేను గోవర్ధన్ని రక్షించితే నా మొదటి ప్రియుడు శివగోపాల్‌తో నాకు వివాహం చేస్తానన్నాడు. దానికి సరేనన్నాను. ఇదంతా మానసికమైన బలహీనతతో నే ఒప్పుకున్నాను. కాని యిదంతా తెలిసిన శివగోపాల్ నన్ను అసహ్యించుకున్నాడు. ఇప్పుడు నాకు మిగిలింది గోవర్ధన్. కాని అతనుకూడా రామూగారిని చంపినట్లు, ఏవరి సహాయంతో నైనా నన్నుకూడా చంపవు కదా! అన్నాడు.

అప్పుడు ఈ లోకంలో నా స్థానం ఏమిటో నాకర్థం అయింది. నిజం అంతా మీకు చెప్పాలనిపించింది. కాని ఎందుకో చెప్పలేకపోయాను. గోవర్ధన్ నేరస్థుడని అతనికి తెలుసు. ప్రేరేపణ నేను చేసిందో అతను చేసిందో యిప్పుడు చెప్పే స్థితిలో లేను. నాకు సర్వం బోధపడింది, యింకా రెండు రోజులలో నన్ను వురితీస్తారనగా మాత్రమే! కాని అప్పటికి అన్ని ఏర్పాట్లు ముగిసినవి.

నేరస్థులిద్దరికీ తగిన శిక్ష విధించారు. ఈలోకంలో, కామంతో కళ్లు పూడుకుపోయి

## టెలివిజన్ ఫోను !

టోక్యోలోని నిప్పన్ ఇంటర్‌ఫోను కంపెనీ వారు టెలివిజన్ అమర్చిన ఇంటర్ ఫోనును తయారుచేశారు. అతిథులు కానివ్వండి, అగంతకులు కానివ్వండి, బయట వున్న బెల్ బటన్ నొక్కితే, టెలివిజన్ కెమెరా వారి ప్రతిబింబాన్ని గ్రహించి తెరపై కనిపించేలా చేస్తుంది. ఆ వచ్చిన వారెవరో గృహస్థుడు లోపలనుండే తెలుసుకొనవచ్చును. అతిథులొచ్చిన సమయానికి యింట్లో ఎవరూ లేకపోతే, ఒక విడియో రికార్డరు వచ్చినవారి చిత్రాన్ని రికార్డు చేసి వుంచుతుంది.

— [ గ్లోబలీ ]

పశువుల్లాగా ప్రవర్తించే వారికి ఏమి శిక్ష యివ్వాలో అదే శిక్ష మీరు యిచ్చారు.

ఈ వుత్తరం మీకు ఎందుకు అందజేస్తున్నానంటే, క్షణ క్షణం మీరు నా గురించి ఆలోచిస్తున్నట్లు నాకు కోర్టులో కనిపించేవారు.

నేరస్థుడు కాని గోవర్ధనికి శిక్ష విధిస్తున్నట్లు మీరు ఆందోళన పడుతున్నట్లు నాకు అనిపించింది. అందుచేత, శేషజీవితంలో మీలాంటి ఆదర్శ న్యాయమూర్తులు శిష్టరక్షణ, దుష్టశిక్షణ చేస్తూ, దేశాన్ని పదికాలాలపాటు రక్షించాలనే వుద్దేశ్యంతో వ్రాస్తున్నాను. చివరిక్షణాల్లో నాతో మాట్లాడినప్పుడు గోవర్ధన్ కూడా శిక్షకు అర్హుడనా ఒప్పుకున్నాడు. మీ చర్యకు జోహార్లు.

చివరిసారిగా మీకు ఒక విషయము వ్రాసి, యీ లేఖను ముగిస్తున్నాను.

నీ ఆఖరికోరిక ఏమిటి? అని వురిశిక్షకు ముందు నన్ను అందరిలాగే అడిగితే యీ లెటరు జస్టిస్ జగన్‌గారికి నా మరణం అనంతరం, అందజేయమని కోరాను. నా మరణం అనంతరం అనటంలో ఒక వుద్దేశ్యం వుంది. యీ లోకంలో నాలాంటి వాళ్లకు స్థానంలేదు. అందుచేత బ్రతికి వుండగా నిజం చెప్పనివాళ్లు చచ్చిపోయిన తరువాత నిజం చెబుతారనేది దాంట్లో సత్యం వుందని నమ్మినాను. మొదట దైవం లాంటి భర్తను చంపటంకూడా ఒక ప్రేమికుని కోసం, ఆ ప్రేమికుని మధ్యలో వదిలి మరియొక ప్రేమికునికి హృదయం యివ్వటం హృదయంలేని పని. సరిగదా, రెండవ ప్రేమికుడు మొదటి ప్రేమికుణ్ణి నాకు దక్కేటట్లు చేస్తానంటే వ్యాపార దృష్టితో ఒప్పుకున్నట్లు ఒప్పుకోవటం యింకా దారుణమైన విషయము. బట్టలు మార్చినట్లు యింతమంది ప్రియులను మార్చే స్త్రీమీద ఎవరికి గౌరవముంటుంది చెప్పండి. అసలు భర్తను చంపిన తరువాత భర్తలు కావాలనుకున్న వారు నన్ను పతితగా, చారిణిగా అనుమానించటంలో వారి తప్పేముంది. అందుచేత నాలాంటి స్త్రీల చరిత్రలు బహిరంగపరిస్తే కాలు జారినా తీసుకుని మామూలుగా బ్రతకగలిగిన స్త్రీలకైనా యిది వుపయోగపడగలదని, అసలు కాలు జారటమే జీవితంలో పెద్ద పొరపాటు అని మిగిలిన వారు గ్రహిస్తారని యింత పెద్ద లెటరు వ్రాశాను. సంఘసంస్కరణకు యిది ఏవిధంగా వుపయోగపడినా, నాకు ఎంత చిన్న మేలు చేసినా నా ఆత్మకు శాంతి కలుగగలదు. ఇంతటి అనర్థానికి కారణం మానసిక దౌర్బల్యమని నేను ఆఖరిక్షణాలలో మాత్రమే గ్రహించాను.”

ఆ లెటరు చదివిన జస్టిస్ జగన్ సంతృప్తిగా గాలి పీల్చుకుని ఒక వేడి నిట్టూర్పు విడిచాడు. విధి నిర్వహణలో తన అంతరాత్మ తనకు నిష్పాక్షికంగా తోడ్పడినందుకు తనను తానే అభినందించుకొని, సీతా, గోవర్ధన్‌ల ఆత్మకు శాంతి కలుగుగాక! అని భగవంతుణ్ణి ప్రార్థించాడు.

# మువ్వల మురళి



సీరియల్ — ఆర్. సంధ్యాదేవి

నా ఏడుపు చూసి పెద్దమ్మ గుండె నీరైపోయి వుంటుంది, నన్ను లేవదీసి హృదయానికి హత్తుకుంది. మెల్లగా పెద్దనాన్న కోపం కూడా కరిగిపోయి నన్ను దగ్గరకు తీసుకుని, ప్రేమగా నాతల నిమిరారు. అన్నయ్యకూ, నాకూ చాలా సంతోషం కలిగింది. గుమ్మంలోకి వెళ్ళిన తరువాత ఏం అంటారో అనుకున్న మాకు వారి ఆదరణకు ఆనందం కలిగింది.

పెద్దనాన్న, పెద్దమ్మ నా పెళ్ళి వాళ్ళ చేతులమీద చేస్తాం అన్నారు. అన్నయ్యా,అంతా కలిసి మన్‌మోహన్ తల్లిదండ్రులతో మాట్లాడి పెళ్ళి నిశ్చయంచేసి, ముహూర్తం పెట్టించేశారు. మన్‌మోహన్‌తో నేను చదువుకునే రోజుల్లో నాకు పరిచయం అయింది. చేసుకుంటే అతన్నే చేసుకోవాలి, లేదా ఇక అంతే! అనుకున్నాను. నా పరిస్థితి తారుమారు అవటంతో ఆ ఆశ వదులుకున్నాను. మళ్ళీ అన్నయ్య నాకు ధైర్యం చెప్పి అతనితోనే వివాహం జరిపిస్తానని అన్నాడు. మాట చెల్లించుకున్నాడు. మా నాన్నకు ఇస్తానన్న ఆస్తి పెద్దనాన్న నాకు ఇచ్చేస్తాను అన్నారు.

వదినా! అన్నయ్య నీతో ఈ సంగతులు అన్నీ చెప్పాలని, పెళ్ళికి రమ్మని పిలవడానికి వస్తే నీవు ఏమీ వినకుండా అన్నయ్యను వెళ్ళిపొమ్మనటంతో అన్నయ్య బాధపడుతూ మెడ్రాస్ వచ్చేశాడు. అందుకే జరిగిన సంగతులు అన్నీ ఏ ఒక్కటీ వదలకుండా నీకు వ్రాస్తున్నాను. అర్థం చేసుకుని నన్ను మన్నిస్తావని ఆశిస్తున్నాను. అన్నా, వదినల పెళ్ళి కళ్ళతో చూసే భాగ్యానికి నేను ఎలాగా నోచుకోలేదు. నా పెళ్ళి అయినా అన్నా, వదినల చేతిమీద జరగాలని నా ఆశ. ఈ ఆడ

(గతసంచిక తరువాయి)

పడుచు ఆశ తీరుస్తావని నీ రాకకోసం ఎదురు చూస్తుంటాను. నాపై కోపం మరిచి వెంటనే బయలుదేరిరా! శుభలేఖ పంపిస్తున్నాను.

వదినా! వస్తావు కదూ!

నీ ఆడపడుచు
రోజా రాణి.

వుత్తరం అంతా చదివిన హరిత ప్రాణం నీరైపోయింది. తల తిరిగిపోయింది.

ఛీ! తను ఎంత పాపిష్టిది. అన్నా, చెల్లెళ్ళకి సంబంధం అంటగట్టింది. చదువుకున్నది అయి వుండి కూడా ఆలోచించలేకపోయింది. వదిన పెద్ద చదువుకోక పోయినా ఎంతదూరం ఆలోచించింది. వదినా,అన్నయ్యా ఆయన యింటికి వెళ్ళి వస్తున్నారని తెలిసినా తనకు పట్టనట్టు ఊరుకుంది.

అతనితో సంబంధం త్రెంచుకుందామనే అనుకుంది. ఇంటికి వచ్చినా అవమానించి పంపించేసింది.

తను ఎంత మూర్ఖురాలు!

తలపట్టుకుని మంచంమీద కూర్చుండిపోయింది. కళ్ళనీళ్ళు జలజలా రాలాయి. రోజా! నన్ను క్షమించమ్మా! అనుకుంది మనసులో.

## 50

పెళ్ళి రేపు అనగా మల్లిఖార్జునరావు, హరిత రావటం ఇంటిలో అందరికీ ఆనందం కలిగింది.

విజయమ్మ కోడల్ని చూసి ఒకటే మురిసిపోయింది. కొడుకుద్వారా అంతా విన్నది. వస్తుందో రాదో అని భయపడింది. కోడలు రావటం బలభద్రరావుగారి దంపతులు ఇద్దరు ఆనందించారు. కృష్ణసుమంత్ ఏం జరగనట్టే భార్యతో మామూలుగా మాట్లాడేడు. హరిత మనసుకి హాయనిపించింది.

"రోజా! నన్ను క్షమించు అమ్మా" అంటూ ఆమె చెంపలుపట్టుకుని ఆడపడుచు పాపిట్లో ముంబించింది.

మర్నాడు మన్‌మోహన్ రోజారాణీల పెళ్ళి.

హరిత రోజాని పెళ్ళికూతురిగా అలంకరించి, పెళ్ళి పీటలమీదకు తీసుకువచ్చింది. కృష్ణసుమంత్‌కి చాలా సంతోషంగా వుంది. పెళ్ళిపందిరి అంతా హడావుడిగా తిరిగేస్తున్నాడు.

బలభద్రరావుగారు, విజయమ్మ కన్యాదాతలుగా పీటలమీద కూర్చున్నారు.

మన్‌మోహన్, రోజారాణిల పెళ్ళి చాలా వైభవంగా జరిగిపోయింది.

మర్నాడు—

వచ్చిన బంధువులు అంతా వున్నారు. హరిత దగ్గరగా చేరిన రోజా వదినని అడిగింది, "నీకు అబ్బాయి కావాలా! అమ్మాయి కావాలా!" ఆమె కళ్ళు కొంటెగా మెరిశాయి.

"నన్ను అడగ్గానే సరికాదు, నాకూ కావాలి ఒక అల్లుడూ! కోడలూ!"అంటూ నవ్వింది హరిత.

"నేను అడిగినదానికి సమాధానం చెప్పలేదు నువ్వు" అంటూ మూతి ముడిచింది రోజా.

"మాష్టర్ కృష్ణసుమంత్ అవతరించబోతుంటే ఇంకా అడగటందేనికి" అంటున్న ఆ మాటలు వినగానే వదినా, మరదళ్ళు ఇద్దరూ చివ్వున తల తిప్పి చూశారు.

# మువ్వల మురళి

అప్పుడే గదిలోకి అడుగు పెడుతున్న మన్ మోహన్ చిరునవ్వుతో అన్నాడు ఆ మాటలు.

ఆ వెనక కృష్ణసుమంత్, తరువాత మల్లిఖార్జునరావు వచ్చారు ఆ గదిలోకి. హరిత ముఖం సిగ్గుతో ఎర్రబడిపోయింది. రోజా నాలిక్కరుచుకుంటూ పక్కకు తప్పుకుంది.

మల్లిఖార్జునరావు నవ్వుతూ అన్నాడు—

"బావగారూ! అయితే మీ యింట్లో త్వరలో మువ్వల మురళి వాయించే చిన్ని కృష్ణుడు ఉదయిస్తాడు అన్నమాట" అంటూ నవ్వాడు. అతని మాటలకు అక్కడికి అప్పుడే వచ్చిన బలభద్రరావుగారి దంపతులు, అంతా గట్టిగా నవ్వేశారు.

హరిత చెంపలు ఎర్రబడ్డాయి సిగ్గుతో. మెల్లగా భర్తవైపు ఓరగా చూసింది.

కృష్ణసుమంత్ భార్యవైపు అవ్యాజమైన ప్రేమానురాగాలతో చూశాడు. అతని అంత రంగం అంతా సంతోషంతో నిండిపోయింది. కళ్ళు వింత కాంతితో తళుక్కుమన్నాయి.

ఆ భార్యాభర్తల ఇద్దరి కళ్ళల్లో 'మువ్వల మురళి' వాయించే చిన్ని కృష్ణుడు కదలసాగాడు. కొద్ది నెలల్లో పుట్టబోయే తమ బిడ్డను తలుచుకుని మురిసిపోయారు ఆ దంపతులు ఇద్దరూ.

[అయిపోయింది]

అంకితం

నా యీ రచనా వ్యాసంగానికి
జీవం పోసిన పెద్దఅక్కయ్యకు
(కృష్ణకుమారి) ప్రేమాభిమానాలతో

— సంధ్య





# ★ వారఫలం ★

**7-11-1980 శుక్రవారం మొదలు**
**13-11-1980 గురువారం వరకు**

మేషం : సమర్థవంతమైన వారితో మంచి ఆలోచనలు చేయగలరు. వారమంతా మంచిగా జరుగుతుంది. కార్యరంగంలో మీకు అనుకూలత గలదు. పదిమందిలో మంచిపేరు రాగలదు. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు ఉద్యోగావకాశాలున్నాయి. ఉద్యోగంలో చాలమందికి అనుకూలత కనిపిస్తుంది.

వృషభం : ధైర్యంతో వృత్తి ఉద్యోగాలను శ్రద్ధతో గమనించండి. ఒకవేళ పొరపాట్లు దొర్ల గలవనే అనుమానమున్నది. మీ మంచితనం మీకు యిబ్బంది కలుగజేయగలదు. చాలమంది వ్యాపార వస్తువులు కొనగలరు. అయినా ఎంతో శ్రద్ధతో పనిచేయాలి. స్త్రీలకు శుభకార్యాలోచనలుండ గలవు. చాలమందికి క్రీడారంగానుకూలత చెప్ప వచ్చు. ఆరోగ్యలోపంలేదు.

మిథునం : గ్రహబలమున్నది. మీ శక్తి సామర్థ్యాలుకార్యానుకూలత చేకూర్చగలవు. వృత్తి ఉద్యోగాలు బాగుంటాయి. చాలమందికి రచనా సామర్థ్యంతో ధనాదాయముండగలదు. వ్యాపారం చేసే వారికి ఈ వారం బాగుండగలదు. స్త్రీలకు సాహిత్య కళారంగాలలో అనుకూలత చిక్కగలదు. విలాస వస్తు సేకరణకు అనుకూలతగల వారం. ఆరోగ్యలోపముండదు.

కర్కాటకం : సౌమ్య స్వభావం మీది. ఇంకా చాతుర్యం చూపి కార్యసాధన చేయాలి. చిత్ర రంగంలో అవకాశాలుంటాయి. శత్రువర్గంలేక పోలేదు. లావాదేవీలు అనుకూలం. వ్యవహార జయం చెప్పదగినవారం. స్త్రీలకు ధనాదాయమున్నది. రాదగిన పైకం చేతికి చిక్కుతుంది. ఉద్యోగ ప్రయత్నాలు ఫలింపగలవు.

సింహం : మిమ్మల్ని మోసం చేయాలనీ, మీ దగ్గరనుండి ధనం లాగాలనీ ప్రయత్నించే వారుంటారు. ఆదాయమున్నది. ఆహార విహారాదులలో ఎంతో జాగ్రత్తగా ఉండాలి. మీకు సహాయం చేసేవారు కరువవుతారు. ఎవరినినమ్మటమా? అనే ప్రశ్న ఉదయిస్తుంది. స్త్రీలకు సాటి వారి పోటీ హెచ్చుటం, చేసిన ప్రయత్నం విఫలం కావటం జరుగుతుంది.

కన్య : చిక్కులు క్రమంగా విడిపడే అవకాశం కనిపిస్తుంది. మీమాటకు విలువ పెరుగుతుంది. పత్రికా గౌరవం, సభా గౌరవమున్నది. రాజకీయ వాదులకు, మధ్య వయస్సులో ఉన్న వారికి అనేక అవకాశాలుంటాయి. స్త్రీలకు వృత్తిలో ప్రగతి, మాతనోద్యోగ ప్రయత్నాలు ఫలింపగలవు. ఆరోగ్యలోపముండదు.

తుల : మీకు ప్రసిద్ధ జీవనం సమకూరుతుంది. ఉద్యోగవృత్తులలో ప్రగతి ఉంటుంది. ప్రతి పనిలో మీకు అనుకూలవారం. శ్రద్ధాసక్తులతో చేసే మీ పనులు సక్రమంగా లాభదాయకంగా నెరవేరుటలో ఆక్షేపణలేదు. స్త్రీలకు విద్యాయోగ్యత, ప్రయాణాలుండగలవు.

వృశ్చికం : మాటలో, చేతలో పొరపాట్లు దొరలకుండా చూచుకొండి. అనవసరపు పేచీలలో చిక్కుకోకండి. ఆయాసపడి పనులునెరవేరుటకై ప్రాకులాడకండి. మబ్బు విడచిన ఆకాశంలాగు నిర్మలంగా మనసు ఉండగలదు. ఆయుర్భాగ్యంలో లోటులేదు. స్త్రీలకు అన్ని ముఖ్యరంగాలలో అభివృద్ధి కనిపిస్తుంది. కళారంగ ఖ్యాతిగలదు.

ధనుస్సు : మాటకు విలువ పెరగటంతో, ఏదో విధంగా లాభమున్నది. ముందువెనుక లాలోచించి, భూముల విషయంలో, ఇండ్ల విషయంలో పరిష్కారాలకు దిగండి. కోర్టువ్యవహారాలు అంత అనుకూలంగావు. విలాస వస్తువుల కొరకు ధనం వ్యయం చేస్తారు. స్త్రీలకు విలువగల నగలు కొనటం, ఉద్యోగం కొరకుచేసే యత్నాలు ఫలితానికి రాగలవు.

మకరం : గురువంత ప్రయోజన కారికాక పోయినా, శనిగ్రహం అపకారం చేయడు. అందు మూలాన వెనుకటి వారాలకన్నా, కొంత సుగమమైన, సుఖదాయకమైన, లాభ ప్రదాయకమైన ద్రవ్యాదాయకరమైన వారమే. ఏమయినావయసు మీరినవారు ఆరోగ్య విషయంలో జాగ్రత్త వహించాలి. స్త్రీలకు ద్రవ్యార్జనం, ఉద్యోగ లాభం, చాలమంది క్రీడా రంగంలో చొరవ కనిపిస్తుంది.

కుంభం : ఆరోగ్య విషయంలో, ఎంతో జాగ్రత్త పడదగినవారం. ఆస్తి కొనుగోలు చేయ ప్రయత్నించే దానికన్నా ఉన్నదానిని వృద్ధిచేసి కోదగిన యోచనలో నిమగ్నులు కావటం ఎంతైనా అవసరం. వ్యాపారస్థులు, చిత్ర రంగంలో భారీ వ్యాపారంచేసేవారికి అనుకూలత గలదు. స్త్రీలకు మనశ్శాంతి లోపించటం, గృహ కార్యభారం అనిపించగలవారంగా గ్రహించి మసలుకోండి.

మీనం : మిత్రులతో లేనిపోని గొడవలు రాగలవు. శత్రుత్వం అధికంగా పొడ చూపగలదు. ఆరోగ్యలోపం కూడా ఏర్పడగలదు. బంధువుల వ్యవహారాలలో, తలదూర్చవలసి వస్తుంది. మీ తాలూకు వస్తువులుపోయే అవకాశం కూడా గలదు. జాగ్రత్త ! స్త్రీలకు విద్యా వైజ్ఞానిక రంగాలలో ప్రగతి, లాభదాయక వ్యాపారం కొనసాగే గ్రహానుకూలత గలవారం.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి



## అనారోగ్యులు అభాగ్యులు

మీకు విశాలమైన ఛాతీ, దృఢమైన శరీరం, మంచి తూనిక గలదా? లేకుంటే వెంటనే 'జీవన్‌టోన్' ఉపయోగించుట మంచిది. మీరు ఒక పౌండు జీవన్‌టోన్ కొన్నారంటే మీ శరీరం దృఢమై, తూనిక అధిక మగుటకు మేము గ్యారంటీ ఇవ్వగలము.

## ఆరోగ్యమే భాగ్యము

నిజమే ఆరోగ్యమే భాగ్యము. ఆరోగ్యం బాగా వున్నట్లయితే డబ్బును సంపాదించడం అసాధ్యమేమీ కాదు! లేకుంటే.... జీవన్‌టోన్ సాధారణమైన వ్యక్తులకు వచ్చే వ్యాధులను ఇట్టే బాగుచేయగలదు. మీరు మీ వయసుకన్న అధిక వయసుగలవారిలా గోచరిస్తున్నారా? అలాగైతే వెంటనే ఉపయోగించడం ప్రారంభించండి 'జీవన్‌టోన్'. మీకు తగినంత ఆరోగ్యం, దృఢకాయం, తూనిక సమకూరిన వెంటనే జీవన్‌టోన్ ఉపయోగించుట ఆపుచేయాలి.

కాగా దేహానికి బలం సమకూర్చడానికి, తూనిక అధికరించడానికి జీవన్‌టోన్‌లో కొన్ని విశిష్టమైన మూలికలు చేర్చబడి యున్నవి. కాని ఇందులో జంతువుల క్రొవ్వు చేర్చబడి యుండలేదు. స్పెషల్ జీవన్‌టోన్ పెద్ద సీసాలు అన్నిచోట్ల సులభంగా లభించగలవు. (వ్యాయామం అవసరం లేదు. ఒకవేళ ఇంతకుముందు అలవాటు వున్నట్లయితే కొనసాగించవచ్చు.) వెల : **454** గ్రాములు (1 పౌండు రు. **20/-**) ★ సెల్‌బాయిల్ మరియు సెల్ఫో పౌడర్ : వయసుకు వచ్చినవారికి మాత్రమే వెల : రు. **24-00** (ఉభయులకు) ★ స్కిన్ లీక్సు : మొటిమలను తొలగించి మీ ముఖమును సుందరముగా తేజోవంతముగా నుంచును. వెల : రు. **20-00**. క్రిందిచోట్లయందు లభించగలవు :

వరంగల్ : ఆయుర్వేద రసాయనశాల, జె. పి. ఎన్. రోడ్డు ఆయుర్వేద మెడిసిన్ ఆయుర్వేద ఇన్‌గ్రిడియన్స్, ఎస్. వి. రోడ్డు. మచిలీపట్నం : ఉమామహేశ్వర ఆయుర్వేదిక్ ఏజెన్సీస్, తెనాలి : గుడివాడ హనుమంతరావు & సన్స్. హైదరాబాద్ : సంపత్ & కం., పంజగుట్ట, జైరాం మెడికల్స్, కోటి, బ్యాంక్ రోడ్డు, వసంత్ మెడికల్‌స్టోర్స్, 4-4-293, బ్యాంక్‌రోడ్డు, మహేశ్ మెడికల్ హాల్, క్లాక్ టవర్ ఎదుట, విష్ణు మెడికల్ హాల్, గుల్జార్‌హౌస్. ఇచ్ఛాపురం : జనతా మెడికల్‌స్టోర్స్. పర్లాకిమిడి : పి. ధర్మనారాయణమూర్తి & సన్స్. కాశీబుగ్గ : తంగుడు నారాయణమూర్తి. టెక్కలి : టి. ఎస్. ఎన్. మూర్తి. పార్వతీపురం : పద్మినీ మెడికల్ స్టోర్స్. పాలకొండ : సూర్య డ్రగ్ హౌస్. శ్రీకాకుళం : పట్నాల సత్యనారాయణ అండ్ సన్స్, పాలచెట్లు స్ట్రీట్. విజయనగరం : భట్నం లింగప్రసాదరావ్ మెయిన్‌రోడ్డు. విశాఖపట్నం : నీలం & కం., ఏ.వి. ఎన్. కాలేజి రోడ్డు, డా. జె.ఎ. శాస్త్రి, సూర్యాబాగ్ జంక్షన్. రాజమండ్రి : ఈశ్వరదాస్ & కం., జైహింద్ బిల్డింగ్. గుంటూరు : ఆంజనేయ మెడికల్స్, జిన్నా టవర్ సమీపం. శ్రీ సత్యనారాయణ ఏజెన్సీస్. కాకినాడ : లక్ష్మీనారాయణ కంపెనీ. విజయవాడ : శ్రీ ధనలక్ష్మి మెడికల్‌స్టోర్స్, సూర్యా మెడికల్ స్టోర్స్, పార్కురోడ్డు. అనకాపల్లి : కాసుమంచి అప్పలరాజు. మదనపల్లె : హయగ్రీవ షాప్, 10/75 నెహ్రూస్ట్రీట్. నెల్లూరు : కె. ఎస్. రావ్ & సన్స్, ట్రంక్‌రోడ్డు. సూర్యాపేట : కమర్షియల్‌సూర్య నివాస్ — 2 టవున్ పోలీస్‌స్టేషన్ ఎదుట. సికిందరాబాద్ : జ్యోతిమెడికల్ హాల్ 28. ఎమ్. జి. రోడ్డు, డి. జె. పరేక్ & కంపెనీ, సుభాష్‌రోడ్డు. జామామసీదు, శారదాస్టోర్స్, 3106 రాష్ట్రపతిరోడ్డు. కావలి : డా. మల్లేశ్వరరావ్, ఆర్.ఎమ్.పి. మెస్సర్స్ సుగుణ ఆయుర్వేద ఆలయం. రేపల్లె : రామకృష్ణ మెడికల్ అండ్ జనరల్ ఏజెన్సీస్, రైల్‌పేట. తాడేపల్లిగూడెం : కల్యాణరామ ఆయుర్వేద వైద్యశాల, మామిడివారిస్ట్రీట్, పోవర్ బ్రిడ్జి సమీపం. కందుకూరు : ముమ్మిశెట్టి వెంకటేశ్వర్లు మెడికల్ స్టోర్స్. తిరుపతి : తరిగొండ మెడికల్స్, 247-బి, సరోజినిరోడ్డు. అనంతపురం : డి. సోమనాథశాస్త్రి, మునిసిపల్ కాలని. రామచంద్రపురం : రూపా మెడికల్‌స్టోర్స్, మునిసిపల్ మార్కెట్టు, సుభాష్ రోడ్డు. అనంతపురం : కో-ఆపరేటివ్ సెంట్రల్ సొసైటీ లిడ్., రైల్వేస్టేషన్ సమీపం. పులివెందుల : శ్యామల మెడికల్ స్టోర్స్, మెయిన్‌బజార్. హిందూపురం : జె. ఆర్. భాస్కరయ్య & సన్స్, మెయిన్ బజార్. బాలాజీ మెడికల్ సెంటర్, మెయిన్‌బజార్. ఆదోని : కమలాపుర్ గోవిందశెట్టి, ఆర్. ఎమ్. పి. కమలాపురె నాగయ్యశెట్టి & సన్స్, కొత్తగూడెం : పేరేంద్రుల శంకరయ్య & సన్స్. ధర్మవరం : శ్రీ నంజుండేశ్వర మెడికల్‌స్టోర్స్, మెయిన్‌బజార్. గుంతకల్లు : గోపాల్ మెడికల్‌స్టోర్స్, జంగారెడ్డిగూడెం : బేడ వెంకటరావ్. రాయదుర్గం : శ్రీ లక్ష్మీవెంకటేశ్ మెడికల్‌స్టోర్స్. తాడిపత్రి : కృష్ణ మెడికల్స్, మెయిన్‌రోడ్డు. గోరంట్ల : వెంకటేశ్వర మెడికల్ స్టోర్స్, హిందుపురం పోస్టు. కర్నూలు : శ్రీ రామకృష్ణ మెడికల్ హాల్, 52/19 బాస్టియన్‌రోడ్డు. గుత్తి : డి. ఆర్. రాజశెట్టి & సన్స్, మెయిన్ బజార్. పామిడి : ఎన్. సి. చిన్నప్పశెట్టి. కడప : శ్రీ సాయిరామ్ ఆయుర్వేదిక్ మెడికల్స్, 13/348 మునిరావ్‌స్ట్రీట్. గిద్దలూరు : ఎమ్. సాంబయ్యశాస్త్రి అండ్ సన్స్. అన్ని మెడికల్‌స్టోర్స్ అండ్ బుక్ సెల్లర్స్.

**అధికృత విక్రయందార్లు : మెస్సర్స్ : బాలాజి కెమికల్ వర్క్స్,** ఎ. పి. ఐ. ఇ. 5 వ రోడ్డు, బాలనగర్, హైదరాబాదు—37, ఫోన్ : 269490.

పై పేర్కొనబడిన తయారీలు మీ వూరియందు లభించనట్లయితే దయచేసి రు. 5-00 మాకు పంపిన మీకు వి. పి. పి. ద్వారా పంపగలము.

**మెసర్స్ : జీవన్‌టోన్ ప్రొడక్ట్స్,** పోస్టుబాక్స్ నెం. 880, 17/1, కేంబ్రిడ్జి రోడ్డు, అలుసూరు, *బెంగుళూరు-560 008.*

# బాలుని సాహసం !

కరీంనగర్ జిల్లా ధర్మపురి పుష్కరాలకు వెళ్ళిన 12 ఏళ్ళ బాలుడు మొన్న సెప్టెంబరు 24వ తేదీన ఓ చెరువులో ఈత కొడుతుండగా ఓ పదడుగుల పాము పక్రున అతని మీదికి వచ్చేసరి కాతను ధైర్యంగా ఆ పాము నోటిని రెండు చేతులతోనూ పట్టేసుకుని ఒడ్డుకు వచ్చాడట. దిక్కు తోచని ఆ పాము అతని శరీరాన్ని గట్టిగా తన శరీరంతో చుట్టేస్తే, అతని కేకలు విన్న చుట్టు పక్కల వాళ్ళొచ్చి గొడ్డళ్ళతో ఆ పాముని నరికి పిల్లాడిని రక్షించారట.

## స్టాంపుల దహనం !

మాస్కోలోని ఒలింపిక్ పందాలు ఆరంభ సందర్భంగా కెనడా దేశం ఓ తపాలా స్టాంపు ప్రింటు చేసిందట. అనక కారణాంతరాల వల్ల కెనడా దేశం ఒలింపిక్ పందాలలో పాల్గొనలేదట. తత్ఫలితంగా 17 సెంట్లు వెలగల కొన్ని వేల ఈ ఒలింపిక్ తపాలాస్టాంపులు కాల్చి తగులబెట్టేసిందటా దేశం. వెర్రి వెయ్యి విధాలన్నారందుకే!

## ఏనుగుల వధ !

జింబాబ్వే అనే దేశంలో అడివి ఏనుగులు ఎక్కువై పంటలన్నీ నాశనం చేస్తున్నాయని ఆ దేశానికి కోపం వచ్చి ఓ ఆదేశం ఇచ్చిందట. తత్ఫలితంగా సుమారు అయిదు వందల ఏనుగులను కాల్చి చంపివేశారట. అక్కడ సుమారు 35వేల పైగా అడివి ఏనుగులు తిరుగాడుతున్నాయట.



## ఆత్మహత్యకుదారితీసిన రహస్యప్రేమాయణం!

ఆత్మూరుకు చెందిన 24 ఏళ్ళ చెల్లప్ప ఆచారి అనే అతనికి, సేలంకిచ్చిపాలయానికి చెందిన లీలావతి అనే ఆమెకూ రహస్య ప్రేమాయణమున్నదట. లీలావతి ఓబిడ్డ తల్లిట కూడాను. అయినా సరే తాను ఆ ఆచారిని వదిలి బ్రతుకలేనని నిర్ధారణకు వచ్చి అతనితో కలిసి కాపురం ఆరంభించిందట తన భర్తను, పిల్లలు వదిలేసి. చెల్లప్ప ఆచారి తల్లిదండ్రులు, కావాల్సిన వారూ అంతా చేరి రోజూ ఈ ఇద్దరినీ శక్తి వంచెన లేకుండా నానా తిట్లూ తిట్టి దుమ్మెత్తి పోయనారంభించారట. దాంతో ఆ ఇద్దరికి జీవితం మీద మనస్సు విరిగి, నల్లుల మందు త్రాగి, ఈ విషయమంతా రాసి ఓ చాప మీద పెనవేసుకొని పడుకుని, అలానే ప్రాణాలు వదిలివేశారట. ఇతరుల వద్ద మంచి సంపాదించాలని ప్రయత్నం అనవసరమని పెద్దలందుకే అన్నారు.

## మోసంతో 30 లక్షలు !

సింగపూరులోని ఇండియన్ ఓవర్ సీస్ బ్యాంకులో థాయ్‌లాండ్‌కు చెందిన ఒకాయన రెండు దొంగ చెక్కులు ఇచ్చి 30 లక్షల రూపాయలు తీసుకు అంతర్థానమై పోయాడట.

## కట్నపిశాచికి మరో అబల ఆహుతి !

సెప్టెంబరు ఏడవ తేదీ కలకత్తాలోని ఓ భవంతి పన్నెండో అంతస్తు మీంచి 17 ఏళ్ళ నీలం అనే ఆమె పడి చనిపోయిందట. ఆమె పడిన తీరులో చీర గజ్జల వరకు లేచిపోయిందట. జాకెట్టు వూడిపోయిందట. ఆ దారిన పోతూన్న షాంతినిపోలి అనే వేశ్య గుర్తున్న ఆమె చీర సరిచేసి, సదాసరి పోలీస్టేషనుకు వెళ్లి రిపోర్టు ఇచ్చిందట. పోలీసు విచారణలో ఆమె ఆత్మహత్య చేసుకున్నట్లు ఆమె భర్త, అత్తగారూ చెప్పారట. కానీ ఆమె పడిన చోట రక్తం లేకపోవడమూ, ఇంట్లోని బాత్‌రూము లోను, ఒక కర్టెనుకు రక్తపు మరకలుండడం, నీలం శరీరం మీద దెబ్బలు కాల్పుల గుర్తులుండడంతో పోలీసులు అనుమానించారట. తల్లిదండ్రులు చిన్నప్పుడే చనిపోయిన నీలంను ఆమె అన్న శ్రీకిషన్, అతని భార్య ప్రేమలత తల్లిదండ్రులలా పెంచి పెద్ద చేసి మొన్న ఏప్రిల్ 27వ తేదీన ఆమెకు కలకత్తాలోని పెద్ద బట్టల వ్యాపారి బీరేంద్ర జైను అనే అతనికిచ్చి వివాహం చేసి, ఓ పెద్ద హోటలులో చాలా ఆడంబరంగా విందు చేశారట. పెళ్లయిన నాటి నుంచీ కట్నం డబ్బు బాగా తేలేదని నీలంను ఆమె భర్త, అత్తగారూ నానా పాట్లూ పెట్టేవారనీ, ఈ విషయంలో తానో సారి జోక్యం కలుగ జేసుకున్నా కారణాన్న ఆమెను వారు మరింత హింసించారనీ, సెప్టెంబరు ఒకటో తేదీన తానో ఇరవై వేలకు డ్రాఫ్టు కూడా పంపాననీ ఆమె అన్నగారు చెప్తూ బావురుమన్నాడట. నీలం హత్య మార్వారీలందరికి ఒక అదురుపాటయి, వారంతా చేరి కట్నాలు నాశనమవ్వాలని నినాదాలు చేస్తూ వూరేగింపుగా వెళ్ళారట. చనిపోయే నాటికి నీలం మూడో నెల గర్భిణి అట.

## ప్రియురాలి తల్లి తల నరికిన ప్రియుడు !

ధర్మపురికి చెందిన 22 ఏళ్ళ పచ్చయప్పన్ అనే అతను ఎదురింటి పిల్ల 22 ఏళ్ళ భానుమతిని ప్రేమించి, ప్రేమింప చేసుకున్నాడట. ఇద్దరు కలిసి హాయిగా రహస్య ప్రేమాయణాలు సాగించు కున్నాక భానుమతి మద్రాసుకు చెందిన మురుగన్ అనే అతన్ని పెళ్లిచేసుకుని మద్రాసు వెళ్లిపోయిందట. అనక రెండేళ్ళు గడిచాక మళ్ళీ పుట్టింటికివచ్చి అక్కడ పచ్చయప్పన్నుచూసి పాతకాలం గుర్తుకు వచ్చి అతనితో మళ్ళీ సంతోషంగా, రహస్యంగా గడప నారంభించిందట. ఇక ఇలా ఒద్దు. మనిద్దరం పెళ్లి చేసుకుందామని పచ్చయ్యప్పన్ చెప్తే పరేశాని ఆ మర్నాడు దల్లగా మద్రాసు జారుకుందట. భానుమతి కోసం ఆమె ఇంటికి వెళ్లిన పచ్చయ్యప్పనుకు భానుమతి తల్లికి జరిగిన వాగ్వాదంలో భానుమతి తనకు దక్కక పోడానికామె తల్లే కారణమని గొడ్డలితో ఆమెను ముక్కలుగా నరికి చంపి, నేరుగా పోలీసు స్టేషనుకు వెళ్లి, గొడ్డలి ఎస్.ఐ. టేబులు మీద పెట్టి విషయం వివరించాడట. ●







# ఎల్లప్పుడు చురుకుగా ఎల్లప్పుడు చైతన్యంగా




మీ బిడ్డ పెరుగుతున్నప్పుడు, ఆ బిడ్డ నిరంతరం అధికంగా శక్తి వినియోగించడం జరుగుతుంది.

బూస్ట్‌ను పాలల్లో కలిపితే, రుచికరమైన మాల్ట్ చాకొలెట్ పానీయం తయారౌతుంది. అది మీ బిడ్డకు కావలసిన శక్తిని సమకూరుస్తుంది. ఎందుచేతనంటే బూస్ట్, సంపూర్ణమైన మీగడ పాలు, గోధుమ, బార్లీ మాల్ట్, కోకోలతో తయారైనది.

మీ బిడ్డకు, శక్తినిచ్చే ఈ ఇంధనాన్ని ఇవ్వండి. అది మీ బిడ్డ రోజంతా, ప్రతి రోజూ కూడా చురుగ్గా, చైతన్యవంతంగా ఉండేటట్టు చేస్తుంది.





B-8136 Tel-7

పొదుపు రీఫిల్ ప్యాక్ కొని రు. 1/- ఆదాచేయండి

## బూస్ట్

## చురుకైన జీవనానికి శక్తినిచ్చే ఇంధనం







# అవీ - ఇవీ - అన్నీ

## కొన్ని వంటింటి చిట్కాలు

* మూడుచెంచాల నిమ్మరసం ప్రతి ఉదయం ఒక కప్పు నీళ్లలో కలిపి త్రాగితే రక్తం వృద్ధి అవటమే కాకుండా దేహానికి 'సి' విటమిను కూడా లభ్యమవుతుంది.
* పాల మీగడలో ఓ చుక్క ఆముదాన్ని కలిపి రంగరిస్తే వెన్నలాతయారవుతుంది. దాన్ని "గోరుచుట్టు" మీద పూస్తుంటే గోరుచుట్టు తగ్గుతుంది.
* వెడల్పాటి పాత్రలో చల్లని నీరు పోసి పెరుగు గిన్నెను పెట్టినట్లయితే పెరుగు పుల్లగా వుండదు.
* నిమ్మకాయ ముక్కతో తల బాగా రుద్దుకుని వేడినీటితో స్నానంచేస్తూ వుంటే తల చుండు తగ్గుతుంది.
* వేడిపాలలో బెల్లం, మిరియాలపొడి కలుపుకొని త్రాగితే గొంతులోని కఫం తగ్గుతుంది.
* రోజుకు రెండుసార్లు మంచిగంధాన్ని అరగదీసి ముఖానికి రాస్తుంటే మొటిమలు తగ్గిపోతాయి.
* ముక్కుపైన ఆవనూనె మర్దించండి, జలుబు తగ్గుతుంది.
* గాయం తగిలి రక్తంకారేటప్పుడు పంచదారను మెత్తగా నూరి ఆ గాయంలో వేసి నొక్కినట్లయితే రక్తం కారడం ఆగుతుంది.
* కురుపు మచ్చలకు తేనె వెంట వెంటనే రాస్తుంటే మచ్చలు పోతాయి.

— ఎస్. భువనేశ్వరమ్మ

## రష్యాలో 'రాదుగ' ఉపగ్రహం

కమ్యూనికేషన్ వ్యవస్థలను, టెలివిజన్ ప్రసార వ్యవస్థలను కృత్రిమ భూ ఉపగ్రహాల ద్వారా పెంపొందించే కార్యక్రమంలోభాగంగా, సోవియట్ యూనియన్ ఈ నెల 5వ తేదీన 'రాదుగ' కమ్యూనికేషన్ ఉపగ్రహాన్ని ప్రయోగించింది. దీనిలోని రి-ట్రాన్స్మిషన్ పరికరాలు అహర్నిశలూ రేడియో, టెలిఫోన్, టెలిగ్రాఫ్ ప్రసారాలను సెంటిమీటర్ వేవ్ రేంజిలో నిరంతరాయంగా కొనసాగించడానికి, 'ఆర్బిటా' కేంద్రాల సముదాయానికి కలర్, బ్లాక్ అండ్ వైట్ టెలివిజన్ కార్యక్రమాలను నిరంతరాయంగా ప్రసారం చేయడానికి ఉద్దేశించినవి. "రాదుగ" ఉపగ్రహంలోని పరికరాలన్నీ సజావుగా పనిచేస్తూ వున్నాయి.



## అంతరిక్షంలో 183 రోజులు

వ్యోమగాములు లియోనిద్ పొపోవ్, వాలెరీ ర్యూమిన్‌లు 183 రోజులుగా అంతరిక్షంలో శాస్త్రీయ పరిశోధన నిర్వహిస్తూ వున్నారు.

భూమి సహజ వనరులనూ, పరిసరాలను అధ్యయనం చేసే తమ కార్యక్రమాన్ని కక్ష్య వేదికలోని వ్యోమగాములు కొనసాగించారు. ప్రపంచంలోని వివిధ ప్రాంతాలలో వాతావరణ వంగాలను, అట్లాంటిక్, హిందూ మహా సముద్రంలోని ఉరవడినీ వారు పరిశీలించి, ఫొటోలు తీశారు.

స్వయంచాలక రవాణానౌక 'ప్రోగ్రస్–14' కొనివచ్చిన సరుకులను వారు దింపుకున్నారు.

ఈ అంతరిక్ష యాత్ర నిర్ణీత ప్రకారం కొనసాగుతూ వుందనీ, వ్యోమగాములు ఉల్లాసంగా పనిచేస్తున్నారనీ, అంతరిక్ష వేదిక నుండి అందిన వార్తలు, టెలి మెట్రిక్ సమాచారమూ తెలుపుతూ వున్నాయి.

### మనవి

మా కార్యాలయానికి వచ్చి కథలు, కార్టూన్లు యిచ్చేవారుకూడా వాటితో పాటు తగినన్ని తపాలాబిళ్లలంటించిన స్వంత చిరునామాగల కవరు వుంచడం మంచిది. వాటిని తిరిగి చేతికి అందివ్వడం సాధారణంగా జరుగదని మనవి.

సం.









## కోకిలలు క్యూలో

మామిడిచిగుళ్ళూ వసంతం
మామూలుగానే వచ్చాయి
కోకిలలు తప్ప—ఆ కుహూ
కూజితాలు తప్ప.

కోపకు మతిపోయింది
గుడ్లు (ర)జేసింది.
కోకిలలేవీ అంటూ
కేకలు వేసేసింది.

"కుహూ కుహూ అంటేగాని
కుమకురాదే నా కంటికి.
కోటిరూపాయల బహుమతి
కోకిలల్ని తీసుకొచ్చే చేతికి."

ఎదురు చూస్తూ వుంది కోవ
విన్నాళ్ళుగానో ఉసూరని.
ఏ కోకిలా రాకపోదా
ఆ కోటి రూపాయల కోసమని.

కోవ పిచ్చిది; తెలియదు దానికి
కోకిలలన్నీ క్యూలో వున్నాయని.
వచ్చి చిగుళ్లమీద వెగటు పుట్టి
వంచదారకోసం ఎగబడుతున్నాయని.

— డా॥ సి. నారాయణరెడ్డి

## అవీ...ఇవీ...అన్నీ

### నాస్తికత్వం కావాలి

శ్రీ చార్లెస్ బ్రాడ్లా ఆంగ్లపుస్తకం "ప్లీ నట్ ఏథిఇజమ్"కు తెలుగు భావానువాదం. 24 పేజీలు వెల రెండురూపాయలు, ప్రతులకు: నాస్తిక కేంద్రం, విజయవాడ—520006.

### ఉరి కొయ్య

నాటకం రచన : శ్రీ వేగ్గపూడి రంగనాథం, 132 పేజీలుగల ఈ పుస్తకం వెల ఆరురూపాయలు. ప్రతులకు : ఉత్తమ గ్రంథమాల, సోల్ డిస్ట్రిబ్యూటర్స్, పాలకొల్లు.

# ఫిలిప్స్ మూడు బ్యాండ్ల రేడియోలు నమ్మశక్యం కాని స్టేషన్లు-గ్రహించే శక్తి, దివ్యమైన ధ్వని.







## ఫిలెటా

- రెండు షార్ట్ వేవ్ రేంజ్‌ల మీద అతి విస్తృతమైన బ్యాండ్ స్ప్రెడ్
- 750 mW హెచ్చు అవుట్‌పుట్
- 10 సెం.మీ. లోతుగల లౌడ్‌స్పీకర్లు
- అతి తేలికగా తిరిగే పాయింటర్, సులభంగా ట్యూన్ చేసుకోవడానికి పెద్ద ట్యూనింగ్ నాబ్
- రేడియోలోనే బ్యాటరీ ఎలిమినేటర్ అమర్చుకొని కరంటు మీద వాడుకోవచ్చు

**రూ. 370/-***

## పయొనీర్

- పొదుపుతో అతి ఉత్తమంగా పనిచేసే 3-బ్యాండ్ల పోర్టబుల్
- బ్యాటరీలు అయిపోవచ్చినా ఒకేలా చక్కగా వినిపించేందుకు స్టెబిలైజింగ్ డయోడ్
- ఆకర్షణీయమైన, విశిష్టమైన కంట్రోల్-పేనల్
- 3 బ్యాటరీల మీద పనిచేస్తుంది

**రూ. 335/-***

## కమాండర్

- చక్కని పనితనం కనిపించే 3-బ్యాండ్ల పోర్టబుల్ సెట్
- బ్యాండ్ మార్చుకొనేందుకూ, ఆన్/ఆఫ్ చేసుకొనేందుకూ టాగల్-స్విచ్‌లు
- వాల్యూమ్ మరియు ఫైన్ ట్యూనింగ్ కోసం స్లైడ్ కంట్రోల్స్
- కరంటు మీద పనిచేసే సెట్ కూడా దొరుకుతుంది

**రూ. 510/-***

*చిల్లరగా అమ్మే గరిష్ఠ వెల, ఎక్సైజ్ డ్యూటీతో సహా.
రాష్ట్ర అమ్మకం పన్ను, ఇతర స్థానిక పన్నులు అదనం.




**అత్యుత్తమమైన దానినే మీరు పొందాలని మా కోరిక**

పైకో ఎలక్ట్రానిక్స్ అండ్ ఎలక్ట్రికల్స్ లిమిటెడ్

# ఫిలిప్స్

**భారతదేశంలో 50 ఏళ్లు**

CASPR-788-244 TEL




## ఉత్తరాలు

(6 వ పేజీ తరువాయి)

### వ్యాసం

'కాత్యాయని తొమ్మిది అవతారాల గాథలు' మారుతిగారి వ్యాసం ద్వారా తెలియని విశేషాలు ఎన్నో తెలుసుకొన్నాం! ఈ వారం కథలు అన్నీ బావున్నాయి. కార్టూన్లు మాత్రం నిరాశకలిగించాయి. సినిమా పేజీలలో రంగురంగుల తారల చిత్రాలు ప్రచురిస్తున్న సంపాదకవర్గం అభినందనీయులు.

ఎల్. ప్రఫుల్లచంద్ర, కె. జి. హేమలత, హెచ్. రాము, లక్కారాజు శ్రీఫణీంద్రనాద్, రఘునాద్ (ధర్మవరం)

### "కనువిప్పు"

17.10.80 సంచికలో ప్రచురితమైన మారెళ్ళ ఉమాదేవిగారి కథ 'ప్రేమంటే ఏమిటి!' మాకెంతో నచ్చింది. "కలకత్తా వాసులకి ఆదివారం అంటే హాయిగా గాలి పీల్చుకునే వారం" అనేది అక్షరాలా నిజమనిపిస్తోంది. ఒక ఆడది కాస్త చనువుగా మాట్లాడినంత మాత్రాన ఏదో వూహించేసుకుని కాలరెత్తుకుని తిరిగే పురుష పుంగవులకు 'కనువిప్పు' కావాలి మరి!

కుమారి కవిత. యం. (బరంపురం)

### సీరియల్

3—10—80నాటి సంచికలో 'మువ్వలమురళి' సీరియల్ చదివాక, రచయిత్రి సంధ్యాదేవిగారిని అభినందించాలనిపించింది. ఏటొచ్చీ కృష్ణ సుమంత్ రోజాని హోటల్‌రూముకి తీసుకు వెళ్ళివస్తూ ఆమెతో జరిపిన సంభాషణలవల్ల, కథలో సస్పెన్స్ పోయినట్లు అనిపించింది. ఆమెకు పెళ్ళిచేసేందుకు హోటల్‌రూమ్‌లో పెళ్ళికొడుకుని ఉంచి, పెళ్ళిచూపుల కోసం తీసుకు వెళ్ళినట్లు గ్రహించవచ్చు. అందువల్ల రోజా, కృష్ణ సుమంత్ చెల్లెలు కావచ్చుని తెలియవస్తోంది. హోటల్ నుంచి వస్తున్నప్పుడు ఎవరో చూసినట్లు, హారితతో చెప్పినట్లు ఉంటే ఇంకా సస్పెన్స్ క్రియేట్ అయ్యేది.

అరట్ల ప్రసాదరావు (అహ్మదాబాద్)

### కథలు

'ఒక భగీరదుడి కథ'లో మా కథ జ్ఞాపకం వచ్చింది. ఆయన పడ్డ బాధ మేము విశాఖపట్నం మునిసిపల్ కార్పొరేషన్‌తో మేముఅనుభవించాము. వాటరు వర్క్సులోనే కాదు కుళ్ళి యున్నది. శానిటరీ సెక్షన్‌లో యింకా యున్న ది పాత బస్సుస్టాండు బురుజుపేట, కొత్త రోడ్డు, అల్లిపురంలో గేదెలు, పందులు స్వైర విహారం చేస్తూ యున్నాయి వాళ్ళ దీవనల వలన. కార్పొరేషన్ బాగుచెయ్యాలంటే మరియొక మారు ఎమర్జెన్సీ రావాలి.

ఎం. సత్యవతి (విశాఖపట్నం)

* * *

26—9—80వ తేది ఆంధ్ర సచిత్ర వార పత్రికలో ముఖచిత్రం శారద చాలాబాగుంది. ఇకక్కథలో 'తల్లితండ్రులూ జాగ్రత్త' కథ చాలా బావుంది. ప్రతితల్లి బిడ్డను కనడమేకాదు. గొప్ప, వారి పసి హృదయంలో అమృతపు జల్లులు కురి

## ఉత్తరాలు

పించినప్పుడే నిజమైన కన్నతల్లి అనిపించుకుంటుంది. 'శిశిర జీవితాలు' చాల మంచి రచన. త్యాగంలోనే ఉన్నది ఎంతో గొప్ప మనస్సు అని తెలుస్తుంది ఈ రచన ద్వారా. "ప్రేమతీర్థం" సీరియల్ చాలా ఉత్సాహకరంగా ఉంది.

బి. ఆనంద్ (ఆదోని)

*  *  *

24.10.80 దసరా సంచిక ఎంతో ఆకర్షణీయంగా ఉంది. "మెత్తని పులి" కథ చాలా బాగుంది. కథ చిన్నదైనా మమ్మల్ని ఆకట్టుకుంది. "ప్రేమ తీర్థం" సీరియల్ ఎంతో ఉత్సాహంగా సాగుతూంది. ఈ మధ్య ఫాలాక్ష్ని డైరీ లోని విషయాలు విజ్ఞాన దాయకంగా ఉంటున్నాయి. దసరా పండుగ సందర్భంగా వేసిన కార్టూన్స్ కడుపుబ్బ నవ్వించాయి.

గవిని సత్తిరాజా, సత్తిబాబు (అత్తిలి)

*  *

'ప్రేమ తీర్థం' సీరియల్ ఇంటరెస్ట్‌గా సాగుతూంది. మీ (మా) ఆంధ్ర సచిత్ర వారపత్రికయందలి కథలను చదువుతువుంటే మా గుండెలు గులాబీ పుష్పములా వికసించుచున్నవి.

"మిలాడియా" కుటుంబ సభ్యులు (ఆలంపూర్)

*  *  *

17.10.80 పత్రికచదివాను. కాలచక్రం కథ చాలా బాగుంది.

ఈ వారం పత్రికలో డాక్టర్ సలహాలు లేకపోవడం చాలా నిరుత్సాహ పరిచింది. ఈ మధ్య కాలంలో మీరు పత్రికలో తీసుకు వచ్చిన మార్పుని గెటప్, చక్కని కథల ఎంపిక నన్ను ఆనందపరుస్తున్నాయి.

దేవరాజ విజయ (ఒరిస్సా)




**Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.**












నలుగురూ కలిసి
ఆనందించే
సమయము ఇదే !

థమ్సు
అప్

కోలాయొక్క ఉల్లాసము
తాజాదనమునకు
నేస్తము

TRIKAYA PE 5 80 TEL